# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక



మార్చి 1990

వెల : 3.

# అందరికీ నమస్కరించి.....

శ్రీవాణి సర్క్యులేషన్ పెంచాలని ప్రత్యేకంగా ప్రయత్నం చేస్తున్నాము. దిన, వార పత్రికలలో ప్రకటనలు యిచ్చి ప్రచారం చేయడానికిగాని ఉద్యోగులను నియమించి ప్రచారం కొనసాగించడానికి గాని అవసరమైన ఆర్థికస్తోమత మాకు లేదు. అయితే మాకు అండ, దండ పాఠకులే. రెండు వేల కాపీలతో 1985 జనవరిలో ప్రారంభించిన శ్రీవాణి నేడు ఆరువేల సర్క్యులేషన్ దాటింది. ఈ సర్క్యులేషన్‌ను పదివేలకు పెంచాలని సంకల్పించుకున్నాం. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనేగాక, ఇతర రాష్ట్రములలోను మరియు విదేశాలలోను ఉన్న తెలుగువారి వద్దకు కూడా శ్రీవాణి చేరుకున్నది. మనరాష్ట్రంలో రెండు పర్యాయములు ఉత్తమ పత్రికగా ఎంపికచేయబడి విశిష్ట అవార్డులను కూడా అందుకొనినది.

కనుక శ్రీవాణి పాఠకులకు, అభిమానులకు ప్రత్యేకంగా ఒక మనవి చేస్తున్నాను. సహకారం అందించి శ్రీవాణిని ప్రోత్సహించుతారనే విశ్వాసంతో ఈ చిన్న విన్నపము చేస్తున్నాను. శ్రీవాణి నిజంగా తమకు నచ్చితే, ఈనాటి సమాజమునకు అవసరమైన పత్రికేనని భావించిన యెడల ప్రతి ఒక్కరు కనీసం ఒక క్రొత్త చందాదారుణ్ని చేర్పించి శ్రీవాణిని ప్రోత్సహించుతారని ఆశిస్తున్నాము. ప్రతి ఒక్కరికి మిత్రులు, బంధువులు ఎందరో ఉండి ఉంటారు! అయితే క్రొత్త చందాదారులను చేర్పించాలనే పట్టుదల మాత్రం ఉండాలి. ఒక్క పర్యాయం ఆలోచించండి! జీవితంలో నచ్చినదానికోసం ఎంతయినా ఖర్చుచేస్తారు. శ్రమపడుతారు. ఇది మానవ సహజప్రవృత్తి. అదే విధంగా తమకునచ్చిన శ్రీవాణికోసం ఈ మాత్రం సహాయం అందించలేరా? సహృదయంతో ఆలోచించండి! కనీసం ఒక క్రొత్త చందాను పంపి శ్రీవాణిని ప్రోత్సహించండి? ముఖ్యంగా మహిళామణులు ఈ విషయంలో సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను. మహిళలు మెచ్చిన పత్రిక 'శ్రీవాణి' అని ఎందరో ప్రశంసిస్తున్నారు. భారతీయ సంస్కృతీ, ధర్మం ఇంకా నిలచివున్నదంటే, అది కేవలం మహిళల వల్లనేనని చెప్పక తప్పదు.

భారతీయ సంస్కృతీ ధర్మాలను, సాహిత్య, ఆధ్యాత్మిక విద్యా, విజ్ఞాన విషయాలను ప్రచారం చేస్తున్న శ్రీవాణిని ప్రోత్సహించండి! సర్క్యులేషన్ పెంచేందుకు దోహదం చేయండి! సహకారం అందించండి!

## చందాల వివరాలు

**సం. చందా: రు.42-00; 4 సం. చందా: రు.150-00; జీవిత సభ్యత్వం: రు.600-00 (జీవిత సభ్యుల ఫోటోలు శ్రీవాణిలో ముద్రించబడుతాయి) చందాలు M.O. / D.D. ద్వారా పంపి సహకరించ ప్రార్థన. D.D. మీద "SREE VANI" అని వ్రాయించగలరు.**

ధన్యవాదములు
భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

మార్చి 1990
సంపుటి : 6
సంచిక : 3

శ్రీవాణి
సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రు. 3-50 |
| సంవత్సర చందా | : | రు. 42-00 |
| 4 సం॥ల చందా | : | రు. 150-00 |
| జీవిత సభ్యత్వం | : | రు. 600-00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

# విషయసూచిక

| | | |
|---|---|---|
| ప్రమోదా ! పలుకలేను స్వాగతం | - నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రి | ఏప్రట |
| అమృతవాణి | - కూచిభట్ల చంద్రశేఖరశర్మ | 4 |
| శ్రీ బాలసాయి చరిత్ర | - శ్రీ సత్యసాయిబాబా | 5 |
| శ్రీ సాయి గణేష్ | - కె. బి. మనోహరరావు | 8 |
| డా॥ రామమనోహర లోహియా | - ఎ. ఎస్. అవధాని | 9 |
| కొమరగిరి కారాగార లేఖలు | - | 13 |
| మహామహుల హాస్యాలు | - చింతపల్లి అన్నపూర్ణ | 15 |
| ప్రజాకవి వేమన | - జి. యస్. సాయినాథ్ | 18 |
| గీత-అమృతవర్షిణి | - సాయి గంగామహాదేవ్ | 21 |
| వల (మినీకథ) | - పోలాడి వెంకటరావు | 22 |
| భర్తృహరి | - తాటికొండ తిరుపతయ్య | 24 |
| స్త్రీ స్థానం ఏమిటి ? .... | - సాయిప్రియ | 25 |
| సురవరం ప్రతాపరెడ్డి | - డాక్టరు వి. సిమ్మన్న | 26 |
| దాశ్య విముక్తి | - కావిలిపాటి విజయలక్ష్మి | 28 |
| వైద్యవాణి | - ఎస్. ఎన్. దుర్గారావు | 29 |
| ఆశ....దురాశ....నిరాశ-1 | - సోమంచి రామం | 30 |
| సాయి చెప్పిన కథలు | - | 33 |
| శ్రీ గురూజీ చెప్పిన కథలు. | - | 34 |
| వ్యక్తులూ - వ్యక్తిత్వాలు | - కంచి వాసుదేవరావు | 37 |
| పుస్తకసమీక్ష | - కాజ లక్ష్మీనరసింహారావు | 39 |
| స్వామి సుందర చైతన్యానంద వేదాంత సందేశం | - కొమరగిరి కృష్ణమోహనరావు | 41 |

ముఖ చిత్రం :
డా॥ రామమనోహర లోహియా

# ప్రమోదా! పలకలేను స్వాగతం

నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రి

అగ్నిలో నీరు నీటిలో అగ్గి
తెలుపులో నలుపు, నలుపులో తెలుపులా
తెలుపు నలుపుల కలగలుపుగా
నడిచే కాలంలో సంభవించే
వత్సర పరిభ్రమణంలో
నీ తరుణం ఆసన్నం కాగా ;
ఉన్న గవర్నర్లను ఒక్కుమ్మడిగా ఊడబెరికి
క్రొత్తవారికి పీఠం వేయగా
సంక్రమిస్తున్న క్రొత్త నేతలా
శుక్లానికి వారసునిలా
దాపురిస్తున్న ఓ ప్రకృతి పురుషా !
ప్రాత అలవాట్లు ఆనమాలుగా
ఓనమాలు దిద్దుతావో,
కాక క్రొత్తందనాలు మెత్తుతావో
మా హృదయాలకు ఏం హత్తుతావో !
తెలియకుండానే ముందు
నీకు పలకలేను స్వాగతం.
తత్వాలు మారి కులతత్వాలు రేగి
సాగుతున్న సంకుల సమరాల
ఒంకర భావాలకు కళ్లెం వేసి,
సమైక్యతా విచ్ఛిత్తికి అనువుగా
మూసుకున్న ద్వారాల గొళ్లెం తీస్తావో,
ఇంకా ఇంకా అనైక్యతా తిమిరంలోకి
జనాళిని తోస్తావో! ఏం చేస్తావో !
అటు కేంద్రంలో ఇటు రాష్ట్రంలో
అంతా తారుమారు జేసి
ప్రకృతి వైపరీత్యాలు విస్తరించి
ప్రమాదాలు సంఘటించి
కదనానికి కాలు దువ్వే
వైషమ్యాల రవ్వలు రేపి
మీ చావు మీరు చావండంటూ
దేశాన్ని ప్రమాదంలో ముంచి
వెంచేస్తున్న శుక్లం,
నీ రాకడ చూసి గమిస్తున్నా విసవిసా
మా చూపులు అటే చూస్తున్నాయి రుసరుసా ;
ప్రమోదంగా నువు రానైతే వస్తున్నా
నీ అనుభవాల వాస్తవాలు
తెల్లంకాకుండానే నీ పస
పలికేదెట్లా స్వాగతం మనసా
అందుకే నీకు పలకలేను స్వాగతం.
గతం పరికిస్తే
పొరుగువాని ప్రేరణతో
స్వంత ఇంట్లోనే ఎన్నో దారుణాల
కారణంగా చెలరేగుతున్న
టెర్రరిజం అల్లరిజం ;
నీ ఆగతం నిజం తెలియకుండా
'స్వాగతం' అనే సాహసం లేను.
తెల్లనివి పాలుగా నల్లనివి నీళ్లుగా
భ్రమించి నిన్ను వరించి
నీ యుగాదిని ఉత్సాహంతో చరించలేను ;
ముంచుకొస్తున్న యుద్ధమేఘాలు
వారించే రుద్రయాగాలు జరిపిస్తావో,
వివాదాస్పద 'బోఫర్స్'గన్‌ల తుప్పు దులిపి
కదనానికి కాలుదువ్వే నిప్పులే గుప్పిస్తావో
యోచిస్తే భవితవ్యం భయం భయం
మరి యేలా వుంటుందో నీ హయాం ;
నీ చేతిలో వున్నది గన్నో
కాక ధరలు పెంచే పన్నో
తెలియకుండా మున్ను
స్తుతిస్తూ నిన్ను
పలకలేను స్వాగతం.

గతంలో తెలుగన్న మతంగా
ఆభిజాత్యపు అహంకారపు
నియంతృత్వ పరిధిని నలిగిన ప్రజ
ఆ అన్న కాదని ఎంచుకున్న 'చెన్నా'
అంతకంటే మిన్నగా ఏదో చేస్తాడన్న
ఆశకు తెన్ను చూపించి
తెలుగువారి వెన్ను కాస్తావో
మా ఆశలు అడియాసలే చేస్తావో
వేచిచూస్తేగాని తెలియదు నీ సత్తా
విహారయాత్రలకు విచ్చేసే
విహంగాలు సేదతీర్చుకోగా
దేహబాధ పరిమార్చుకోగా
అవకాశమిచ్చే శిలావిగ్రహాల
ప్రతిష్ఠాపనకై వెచ్చించే విత్తంకంటే
తమ చిత్తం, బ్రతికి బట్టకట్టగాక
నిట్టనిలువు అధిక ధరలతో
కృంగి హడలుతున్న అడుగువాడి
బడుగు బ్రతుకులమీద సారించి
నికృష్ట జీవితాలు వారిస్తే
నీకు విజయశంఖం పూరిస్తా
అందాకా పలకలేను నీకు స్వాగతం.
మా తాత చెప్పగా విన్నాను
నీ గతం ఆగతం.
ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి
ఆజ్యంపోసిన ఋత్విక్కుల్లో
నువ్వూ ఒకడివని ;
అట్టి నీ పంచాంగంలో
అమెరికా అణువులే వున్నాయో
క్షిపణులే దాగున్నాయో
ఆ మాట విప్పకుండా
నీ పోకడ తెలియకుండా
రాకడ మాత్రాన విప్పలేను నోరు ;

'కిచిడీ' ప్రభుత్వాల
వాలకం తెలియకుండా
నీ రాకడ మూలకంగా
నీ పేరులోని మోదాన్ని
ఆమోదంగా స్వీకరించి
పొంచివున్న ప్రమాదాన్ని
విస్మరించి ప్రమోదూతా !
నిన్ను ప్రస్తుతించలేను
నీకు పలుకలేను స్వాగతం.
కులమతాల కుమ్ములాట మాకొద్దు ;
ఆరోగ్యమైన సమభావన
సహజీవన సౌభాగ్యం
సమకూరిస్తే చాలు ;
ప్రకృతి వికార వైపరీత్యాలు
తారసిల్లకుంటే చాలు,
మా బతుకులు మేం బతుకుతాం ;
దారిదోపిడీలు దొంగతనాలు
ప్రయాణంలో ప్రమాదాలు
హత్యలు ఆత్మహత్యలు నివారించు ;
నడిరోడ్డుపై అర్థరాత్రి అబల కాదు
కనీసం మగనీడను
పట్టపగలు నిర్భయంగా చరించే
వీలు కలిగిస్తే చాలు
అదే పదివేలు నిన్ను మేం కోరే మేలు.
జాతిపిత మహాత్ముని ఆశయంగా
శాంతి అహింస ధర్మం
దేశంలో వర్ధిల్లితే చాలు
మేం కులుకుతాం,
మా మానాన మేం బ్రతుకుతాం
అంత్యంలో ఘనంగా నీకు
వీడ్కోలు పలుకుతాం
అందుకే,
గతంలో శుక్లానికి పలకలేదు
ఇప్పుడు నీకు పలకలేను స్వాగతం.

శ్లో॥ హస్తీ స్థూలతరః సచాంకుశవశః కింహస్తిమాత్రోఽంకుశః ?
దీపే ప్రజ్వలితే ప్రణశ్యతి తమః, కిందీపమాత్రం తమః ?
వజ్రేణాపి హతాః పతంతి గిరయః, కిం వజ్రమాత్రోగిరిః ?
తేజో యస్య విరాజతే సబలవాన్, స్థూలేషుకః ప్రత్యయః ?

---

# అమృతవాణి

## కూచిభట్ల చంద్రశేఖరశర్మ

ప్రపంచంలో ఏ ప్రాణి అయినా లావుగావుంటే అది బలంకలదనీ సన్నగావుంటే బలంలేనిదనీ అనుకోటం సామాన్యం. అలాగే స్థూలంగావున్న మనిషి బలవంతుడనీ బక్కగావున్నవాడు బలహీనుడని భావించటం పరిపాటిగావున్న విషయం. ఇది నిజంకాదని కొంచెం ఆలోచిస్తే తెలుతుంది. లావుగావుండటం, బక్కగా వుండటం కాదు ప్రధానం. శక్తి వుండటం ముఖ్యం. శక్తి లేనప్పుడు లావైనా బక్కయినా ఒకటే.

శక్తి వ్యక్తిత్వానికి కారణం శక్తిమంతులముందు శక్తిహీనులు తలవంచాల్సిందే. శక్తి అనే పదానికర్థం శారీరకమైన బలమనికాదు. అది తేజస్సు, అంటే యితరులను లొంగదీసుకొనే ఒక సమర్థత. అది ప్రాణితోబాటు సహజంగా పుడుతుంది. అలాంటి సామర్థ్యం చిన్న పరిమాణంలో వున్నా అది యెంత పెద్దపరిమాణంలో వున్నదానినైనా అదుపులో పెట్టగలుగుతుంది.

కడవంత గుమ్మడికాయా కత్తిపీటకులోకువే అనేది మనకు బాగా తెలుసుకదా! గుమ్మడికాయను ముక్కలు చేసే కత్తి, గుమ్మడికాయంత పరిమాణంకలదికాదు. కాని మంచి శక్తికలది.

ఏనుగు చాలా పెద్ద జంతువుకదా! దాని ఎత్తు, శరీరం, కాళ్ళు, తొండం, దంతాలు చూసుంటే భయమేస్తుంది. కాని అంత పెద్దజంతువు కూడా చిన్న అంకుశానికి లొంగిపోయి చెప్పినట్లు వింటుంది. మరి అంకుశం ఏనుగంత లేదే!

కన్ను పొడుచుకున్నా కనబడని కారుచీకటి ఒక దీపం వెలిగించగానే నశించిపోతుంది. అయితే దీపం చీకటంత పెద్దదంటారా? కాదే! చీకటి దీపమంతేవుందా! పెద్ద పెద్ద పర్వతాలు వజ్రాయుధం దెబ్బతిని రెక్కలూడి కిందపడ్డాయంటే — వజ్రాయుధం కొండంతలేకపోయినా దాని శక్తి అమోఘమని స్పష్టమౌతున్నదికదా! కొండ వజ్రంకంటే ఎన్నిరెట్లో పెద్దదికదా!

అంతవరకెందుకు – మన మహర్షులు ఎంతశక్తి సంపన్నులంటారు! సృష్టికి ప్రతిసృష్టి చేయగలవారు. మహాసైన్యంతో చుట్టుముట్టినా మహర్షి యోగదండం ఒకటి చాలు వాళ్ళను పట్టికరిపించటానికి.

భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టినవాళ్ళు మనలాంటి మనుష్యులే కాని వాళ్ళల్లో దాగివున్న శక్తి, నీతి, నిజాయితీ మొదలయినవి ఒక అద్భుతమైన శక్తిని వుత్పాదించాయి. ఆ శక్తిముందు తెల్లవాళ్ళు నిలబడలేకపోయారు.

నిజానికి అనేక మారణాయుధాలు ప్రయోగించగల పాశ్చాత్యులముందు నిలవగలిగిన వారెవరుంటారు. కొల్లాయి కట్టుకొని బక్కచిక్కిన శరీరంగల గాంధీగారి ముందు పాశ్చాత్యుల బలం ఏమైంది?

కనుక వ్యక్తిలో మంచి శక్తి వుండాలి అది వామన రూపంలోవున్నా సమయం వచ్చినప్పుడు ఎంత మంది బలవంతులనైనా అణచివేస్తుంది. బాహ్యరూపం కంటే అంతశ్శక్తి అణువంతైనా అమోఘమవుతుంది. ○



# శ్రీ సత్యసాయి చెప్పిన బాలసాయి చరిత్ర

( గత సంచిక తరువాయి )

అప్పుడు మీకు తెలిసి ఉంటాది. కడప రామసుబ్బమ్మ అని. ఆమె మొట్టమొదటి అడవాళ్లలోపల డిస్ట్రిక్ట్ బోర్డు ప్రెశిడెంట్. మా స్కూలు ఫంక్షన్‌లో ప్రైజులు యిచ్చేందుకు ఆమెను ఆహ్వానించారు (INVITE) కొన్ని స్కూలు కట్టడాలు కట్టాలని టిక్కెట్టు కూడా పెట్టారు. టిక్కెట్టుపెట్టేసి ఒక సినిమాయాక్టర్ 'ఋష్యేంద్రమణి' ని పిలిపిస్తామని పేపర్లువేశారు. ఆమె మంచి డాన్సర్. కాని ఆమెకేదో అననుకూలం వల్ల రాలేకపోయింది. కలక్టర్ వచ్చేశారు డిస్ట్రిక్ట్‌బోర్డు ప్రెశిడెంట్ వచ్చేసింది. అంతా వచ్చారు. కాని ఈమె రాలేదే ? ఈమె రాలేదే ? (ఋష్యేంద్రమణి) అని లక్ష్మీపతి హెడ్‌మాస్టర్ చాలా బాధపడుతున్నాడు. నేనక్కడకుపోయాను. " సార్ ! నేనొకమాటచెబుతాను సార్ !" అని అన్నాను. ఏమి టన్నారు ? "ఆ ఋష్యేంద్రమణి చేసేదేదో నేనే చేస్తాను. మీరేం భయపడకండి" అని చెప్పేశాను.

అప్పట్లో ఋష్యేంద్రమణి ఏమిచేసేదంటే తలపైన ఒక సీసాపెట్టి, సీసాపైన ఒక పళ్లెం పెట్టి, దానిపైన జ్యోతులు వెలిగించి, తాను డాన్సు చేస్తూ, క్రిందనున్న చేతి రుమాలను నోటితో ఎత్తడం ఆమె ప్రదర్శన ప్రత్యేకత. అప్పుడు నేను చెప్పాను ఆమె హాండ్ కర్చిఫ్‌ను మాత్రమే నోటితో తీసింది. నేను సూదిని పెట్టి కంటితో, ఇవన్నీ ( ఆమె మాదిరిగ ) పెట్టుకొని తీస్తాను నేను అని చెప్పి, చేసేది ఋష్యేంద్రమణే అని పేరు చెప్పండని అన్నాను. అప్పుడేంచేసినారు ? నాకొక పెద్ద చీరకట్టి, జడవేసి, డాన్సు ఆడేటప్పుడు జడతో ఇట్లా అట్లా ! ఆనాలిగదా ! అందుకని పెద్దగా, దండిగా కట్టినారు. ఇక్కడ కట్టారు ! అక్కడ కట్టారు ! పడిపో గూడదుగదా ! సరె ! గజ్జలు కూడా కట్టి నన్ను ఒక డొక్కుకారులో తీసుకొనివచ్చారు. ఋష్యేంద్రమణి వచ్చింది ! వచ్చిందని టిక్కెట్లు దండిగా జనం కొనే శారు. ఋష్యేంద్రమణి వచ్చింది, వచ్చిందని పండు

**శ్రీసత్యసాయిబాబా**

కున్న వారందర్నీ లేపుతున్నారు. ఇంతలో ఒక విధమైన వాయిద్యం మొదలు పెట్టేసరికి, నేను నా గజ్జలను శ్రావ్యంగా, హృదయాన్ని కదిలించేవిధంగా కదిలించాను. నేను స్టేజీపైకి వచ్చేసరికి, యింకా అందరూ మైమరచి పోయారు. హెడ్‌మాస్టర్ వచ్చి బాటిల్ (సీసా) నాతలపై పెట్టారు. మరో టీచర్ వచ్చి దాని మీద ప్లేటు (పళ్లెం) పెట్టి జ్యోతులు ముట్టించారు. ఎందుకని ? లోపల కరిపించు (అంటించు) కున్నారేమోనని అనుమానంకదా ! ఈ మాన వులకు, అందువలన ఆ విధంగా స్టేజీపైననే అందరూ చూస్తుండగా అన్నీ పెట్టడం, అన్నీ చేయడం జరిగింది. వాయిద్యాలు వాయించడం మొదలుపెట్టారు. ఇక నేను కంటికి కనిపించకుండా తిరుగుతూ తిరుగుతూ వున్నాను. డాన్సుచేస్తూనే క్రిందకు వంగి సూదిని కంటితో ఎత్తేశాను. ఎత్తేసరికి అందరూ చప్పట్లుకొట్టారు. అప్పుడు కలెక్టరు ఒక మెడలు తెచ్చి, నాకు వెయ్యాలని వచ్చాడు. అతని పేరు "హార్సి" బ్రిటీషువాడు. నన్ను ముట్టి మెడల్

# సంస్కృత నీతి సూక్తులు

1. ఉపయోగం తు ప్రీతిర్న విచారయిష్యతి
   ప్రేమ ఉపయోగాన్ని గురించి ఆలోచించదు.

2. ఉపనామయతి కరో ఽన్నం
   రసాంస్తు జిహ్వైవ జానాతి
   అన్నం వందేది చేతులు, దాని రుచిని గ్రహించేది నాలుక.

3. ఉపాయమాస్థితస్యాపి
   నశ్యంత్యర్థాః ప్రమాద్యతః
   కార్యసాధనలో మంచి మార్గాన్నే అనుసరిస్తున్నా జాగరూకత లేకపోతే కార్యం ఫలించదు.

4. ఉత్సాహవంతః పురుషా
   నావసీదంతి కర్మసు
   ఉత్సాహవంతులకు కార్యసాధనలో కష్టమనేదే ఉండదు.

---

వేయాలన్నాడు. కాని నేను ఋష్యేంద్రమణిగా వచ్చానుగదా! నేను ముట్ట నివ్వనన్నాను. ఎందుకంటే నేను ఋష్యేంద్రమణిగానే నటించాలిగదా! అప్పుడేం చేశాను. నువ్వు ముట్టబోకు. నాకు చేతికివ్వాలన్నాను కాని ఆయన నన్ను ముట్టాలని ముందుకువస్తున్నాడు. అప్పుడు 15 నిముషాలు నాకు, కలెక్టరుకు వాదన జరిగింది. నన్ను బ్రదర్! గా భావించమని ఆయన, నన్ను సిస్టర్! గా భావించి చేతికివ్వండని నేను వాదించుకున్నాము. స్క్రీన్ వెనుకనుండి హెడ్‌మాష్టర్ చెబుతున్నారు. ఆయన కలెక్టర్! నీవట్లాచేయకు! తీసుకో! తీసుకో! అని చెబుతున్నారు. ఇంకా అందరూ చెప్పారు. ఎవ్వరు చెప్పినా నేను వినలేదు. ఎందుకంటే యాక్టుకు తగినట్లు చేయాలి. ఏ వేషం వేశానో, ఆపేరుకు తగ్గినట్లుగా నటించాలి. అస్టేజికి అది రియల్. నేను ఋష్యేంద్రమణిని కదా! అందుకని అతనిని నేను ముట్టనివ్వలేదు. ఈ రకంగా నేను మొండిపట్టు పట్టేసరికి అందరూ క్లాప్స్ (చప్పట్లు) కొట్టి, కలెక్టర్‌గారిని చేతికియిచ్చి రండని అనడంతో, ఆయన చాలా నిరాశతో చేతికిచ్చి వెళ్ళిపోయారు. ఇంతేకాదు, లోపల గ్రీన్ రూములోనికి ఋష్యేంద్రమణి పేరుతో ఎన్నో జాబులు వచ్చేశాయి. దాంట్లో డబ్బుకూడా పెట్టారు కొందరు. ఈ విధంగా ఆనాడు జరిగిపోయింది.

ఇక రెండవరోజు కార్యక్రమంలో ప్రైజులు ఇచ్చేందుకు డిస్ట్రిక్ట్‌బోర్డు ప్రెశిడెంట్ రామసుబ్బమ్మగారొచ్చారు. అందరికి ఆమె ప్రైజులు ఇచ్చివేసింది. ఇక ఋష్యేంద్రమణి ఈనాడు మా బాలబాలికలకు చక్కగ సహాయంచేసింది, మా భవిష్యత్తు బిల్డింగ్‌కు తగినంత డబ్బు సహాయం ఈమె వల్లనే జరిగిందని చెబుతూ ఈమెకు ఈరోజు ఒక సత్కారంచేయాలనే ఉద్దేశ్యంతో, ఆమెకు ఒక పెద్ద చీర తెచ్చామని చెప్పి "ఋష్యేంద్రమణి"గారు అని పిలిచింది. ఎక్కడనుంచి వస్తుందా? ఆ ఋష్యేంద్రమణి అని అందరూ చూస్తున్నారు. నేనొక నిక్కరువేసుకొని పరిగెత్తుకుంటూ వస్తున్నాను. మధ్యలో పోలీసువారు నన్ను ప్రక్కకు త్రోసివేస్తూ, ఆమె వస్తుంది! ఆమె వస్తుంది! నువ్వు పో! అంటున్నారు. ఒక ప్రక్కనుంచి హెడ్‌మాష్టర్ నన్ను పొమ్మంటున్నారు. సరేనని నేను అక్కడికి పోయాను. అప్పుడు ఆహెడ్‌మాష్టర్ చెప్పాడు. నిన్నటి ఋష్యేంద్రమణి ఈ పిల్లవాడేనని. అప్పుడు రామసుబ్బమ్మ నన్ను గట్టిగా ఎత్తుకొని, ముద్దుపెట్టుకొని "నాయనా! ఎంత గౌరవాన్ని తెచ్చిపెట్టినావు. ఈ చిన్నవయస్సులోపల – మా భారతదేశంలో ఇలాంటివారంతా వుంటున్నారా!" అని ఆమె ఆనాడు ఎంతో పొగిడింది. ఆనాటినుండి స్వామి అంటే ఆమెకు చాలా ప్రేమ. ఎక్కడికిపోయినా ఆమె స్వామిగురించి చాలా చెప్పేది ఈ విధంగా ఆనాడు ఉరవకొండ స్కూలుకు ప్రదర్శనాన్ని అందించాం. అందరూ ఎంతో మెచ్చుకొని

శ్రీవాణి

ఆశ్చర్యపోయారు. ఎందుకంటే రాత్రంతా ఋష్యేంద్ర మణేనని అనుకున్నారు. తెల్లవారి చూసేసరికి ఈ పిల్లవాడని తెలిసి ఆశ్చర్యపోయారు. ఎక్కడ చూచినా ఇదే మాట. ఊరంతా ప్రా కి పో యి ం ది. ఆనాటి నుంచి స్కూలులో మొట్టమొదట నేనే ప్రేయర్ (ప్రార్థన) చేసేవాడను.

" ఆ రహతివ ఆహ్వాన ప్రచారత
సునితవ ఉదారవాణి
హింద్ బౌద్ధ సిఖ్ జైన పారశిక
ముసల్మాన్ క్రిస్తానీ
పూర్వ పశ్చిమ ఆసి
తవ సింహాసన పాసె "

అని ఈ జనగణమన మంగళదాయక జయహే అని ఈ పాటనంతా నేను పాడేటప్పుడు పిల్లలంతా ఉండేవారు. నేను ఒక తూరి హృదయపూర్వకంగా నమస్కారంచేసి వచ్చేవాడిని. ఈ రకంగా ఒక రెండు నెలలు చేశాను ఆ స్కూలులో. మే 23 బుధవారంనాడు నేను అక్కడికి (స్కూలు) వెళ్ళాను.

" నేను సాయినని తెలియుము నిక్కముగను
మమత, కాయము, యత్నముల్ మానుకొమ్ము
కాదు నీకు నాతోటి సంబంధమింక
కాదు నన్ను పట్టుట ఎంతటి ఘనులకైన "

అని ఆ పుస్తకాలు అక్కడ పారవేసి ఇంటికి వచ్చేసినాను. సరే ఈ విధంగా నేను పరిగెత్తేసరికి నా ప్రక్కనున్న ఇద్దరు పిల్లలు కూడను నాతో పరిగెత్తుకుంటూ వచ్చేశారు, రాజు ! రాజు ! రాజు ! అంటూ. ఇక అప్పటి నుంచి నా రూపమే మా రి పో యిం ది. నా మాటయే మారి పోయింది, ఎవరికి ఎవరు ? ఎక్కడ నుంచి వచ్చారు? మీరెవరు ? నేనెవరు ? ఈ విధంగా మాట్లాడటం చూసే సరికి నాడు స్కూల్లో రెండవ ప్రక్కన కూర్చొనేవాడొకడు తక్షణమే పరిగెత్తుకుంటూ వెళ్ళి బావిలో దూకి చచ్చి పోయాడు. రాజు లేనటువంటి బ్రతుకు నాకు వద్దూ

## శ్రీ సా యి వా ణి

* నీతియే నీ జాతి ; అది వదిలితివా నీవు కోతి.
* పరదూషణ నివారణలేని మహారోగము.
* పరమాత్మని మెప్పుకై పాటుపడండి ; పరుల మెప్పుకై కాదు.
* పరహేళన - తన పీడన
* పరోపకారానికి మించిన పుణ్యంలేదు. పర నిందను మించిన పాపంలేదు.
* పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం. పాత్రధారి శిష్యుడు, సూత్రధారి గురువు.
* పుణ్యకర్మలకు గీటురాయి త్యాగం. పాపకర్మలకు గీటురాయిలోభం.
* పుస్తకమును మస్తకములో చేర్చు, మస్తకమును పుస్తకంగా మార్చకు.

అన్నాడు. సరే ! రెండవ పిల్లవాడు ఏమి చేసినాడు ? రాజు ! రాజు ! రాజు ! అని బుద్ధి తప్పిపోయింది. పిచ్చి వాడుగా తయారైపోయినాడు. సరే ఆ స్కూలులో నున్న టీచర్సు, పిల్లలు (రెండువేలమంది వుండేవారు) అందరూ స్కూలుకు వెళ్ళకుండా నా ఇంటిచుట్టూ చుట్టు కొని వుంటున్నారు. ఈ సమయంలో ఈ శేషమరాజు (అన్నగారు) తల్లిదండ్రులకు టెలిగ్రాం యిచ్చినాడు. ఇట్లా వుంటున్నాడు, నాకు ఏమీ తెలియటం లేదు, మీరు వచ్చి చూడాల్సిందని టెలిగ్రాం యిచ్చినారు. అప్పుడు తక్షణమే వారు బస్సులో బయలుదేరివచ్చారు నా పరిస్థితి చూశారు. ఈ రకంగా యిక్కడ వుండటం మంచిది కాదని ఊరికి తీసుకొనివెళ్తామని బస్సుకు టిక్కెట్టు తీసుకున్నారు. బస్సుకు టిక్కెట్టు తీసుకొనేసరికి ఐదు బస్సుల పిల్లలు కూడను మేము మీ వెంటే వస్తాము తప్ప, ఈ ఉరవకొండలో ఉండలేమని పిల్లలంతా బయలుదేరి వచ్చేసినారు.

( భగవాన్ బాబావారే స్వయంగా తమ చిన్ననాటి చరిత్రను తమ విద్యాలయ విద్యార్థులకు ఒక పర్యాయం వివరించారు. దానిని యథాతథంగా జనవరి, ఫిబ్రవరి, మార్చి సంచికలలో శ్రీవాణి పాఠకులకు భగవాన్ బాబా వారి ఆశీస్సులతో అందించగలిగినాను. బహుశా రెండవ పర్యాయం అయివుండవచ్చును ; 1940 అక్టోబర్ 20వ తేదీన భగవాన్ బాబా తన అవతారమును గురించి మరల ప్రకటించినట్లు (సత్యం శివం సుందరం ప్రథమ భాగం. పేజీ 55) అవగతమగుచున్నది. ఆ రోజున స్కూలుకు వెళ్ళి వెంటనే తిరిగి వచ్చి, ఇంటి గడపపై నిలబడి, పుస్తకములు పారవైచి, బిగ్గరగా " నేను మీ సత్యమును కాదు. నేను సాయిబాబాను. నేను వెళ్ళుచున్నాను. నేను మీ వాడను గాను. మాయ వీడినది. నా భక్తులు నన్ను పిలుచుచున్నారు. నేను సంకల్పించుకొని వచ్చిన కర్మమును ప్రారంభింపవలసియున్నది. ఇంక నొక్క క్షణమైనను నింట నుండజాలను " అని వెడలిపోవుచుండగా అన్నగారు శేషమరాజు పరిగెత్తుకొని రాగా " నీవు నన్ను బాగుపఱచు నుపాయములు మానుము. నేను సాయిబాబాను. మీతో నాకేం సంబంధం లేదు " అని చెప్పి అబ్కారీ ఇన్‌స్పెక్టర్ బంగళా తోటలోని ఒక రాతిపై బాలసాయి వెళ్ళి కూర్చొనెను. బాలబాబా చుట్టూ భక్తులు చేరగా " మానస భజరే గురు చరణం దుస్తర భవ సాగర తరణం " అను పాటను తొలి ప్రార్థనగా అక్కడ చేరిన అందరిచేత మన బాలసాయి దిక్కులు పిక్కటిల్లునట్లు పాడించెనట — సం. )

## శ్రీ సాయి గణేష్

కె. బి మనోహరరావు

సద్గుణభరితము నిర్గుణతత్వము సాయిగణేశుని రూపం ।
నిత్యనిర్మలా నిర్వికారం । సత్యసాయీశ రూపం ॥

బాలబాలికల భావము పెంచగ । బాబా యిచ్చిన రూపం ।
భ్రమ తొలగించి బాగుపరచుటకు । " భక్తులపాలిటి అపురూపం " ॥

బాధలు బాపే బోధల జేయగ । బాబా యిచ్చిన రూపం ।
భేదమణచి సంయోగము నేర్పగ । " యోగీశ్వరుని రూపం " ॥

3. మానవత్వపు విలువను పెంచే । మనుగడ నేర్పిన మహాశయం ।
మహిమలు చూపి మనసును మార్చగ । " మన స్వామిచ్చిన రూపం " ॥

4. విడివిడి గాక వడివడి గాను । వరలు భక్తి ఐక్యత రూపం ।
బడి గాక సాయి ఒడిలో పొందిన । " ప్రేమ శక్తి ప్రతిరూపం " ॥

5. కలతలు కరిగి సమతను పెంచే । కరుణాలోలుకు కమనీయం ।
కష్టకాలములో ఇష్టప్రాప్తికై । " సృష్టికారు డందించిన రూపం " ॥

6. సిద్ధి బుద్ధులకు ప్రసిద్ధిగాంచిన । సిద్ధివినాయక రూపం ।
బుద్ధుల మార్చి భవమీదేర్చెడి । " బాబా అనుగ్రహ రూపం " ॥

7. పంచ ఒంపులు సొంపును దాల్చిన । " పంచభూత గణనాథుని రూపం " ।
వంచన మాన్పి దురితము ద్రుంచి । " మంచి పెంచి ప్రేమించెడి రూపం " ॥

8. నయ వినయంబులు నియమ నిష్ఠలు । నిగ్గుదేల్చు సాయీశ్వర రూపం ।
నాయకత్వపు ఒరవడి నేర్పెడి । వర వినాయకుని రూపం ॥

9. సర్వదేవతా రూపమె సాయని । స్ఫూర్తినిచ్చు సాయీశ్వర రూపం ।
' శాంతి సుధలా ' విశ్రాంతిగ నిల్చిన । " సాయిగణేశుని రూపం " ॥

ముఖచిత్ర వ్యాసం :

# నిరంతర సత్యాగ్రహ పోరాటాభిలాషి

# డా॥ రామమనోహర లోహియా

మన దేశ స్వాతంత్ర్య సమరయోధులలో అగ్రశ్రేణికి చెందిన మహావీరుడు డా॥ రామమనోహర లోహియా. మహా పండితుడు. అద్భుత మేధాశక్తి సంపన్నుడు, అకుంఠిత దేశభక్తితోబాటుగా, అంతర్జాతీయ మహదవగాహనగల విశాల హృదయుడు, నిరాడంబర జీవి, చిత్తశుద్ధి, లక్ష్యసిద్ధి కలిగి స్వార్థరహితమైన నిరంతర కృషిలో, సాంఘిక విప్లవాలకు దారులు తీసిన కార్యదురంధురుడు, భారతీయతను మూర్తీభవించిన జాతీయాభిమాని, భారత సోషలిస్టు ఉద్యమ నిర్మాత, అత్యుత్తమ మానవతా విలువలు ప్రతిబింబించిన నిర్దుష్ట జీవనశైలి కల మహా మనీషి శ్రీ లోహియా.

## విద్యాభ్యాసం

ఉత్తరప్రదేశ్‌లో అయోధ్యకు దగ్గరగా ఉన్న ఫైజాబాదులో 1910 లో లోహియా జన్మించాడు. తండ్రి హీరాలాల్ వర్తకుడు - అయన రెండు సంవత్సరాల వయస్సులో ఉండగానే తల్లి పరమపదించింది తండ్రి గాంధీగారి శిష్యుడు తొమ్మిది సంవత్సరాల వయస్సులోనే లోహియా మహాత్ముని దర్శనం చేసాడు. బొంబాయి, కాశీ, కలకత్తా, నగరాలలో విద్యాభ్యాసం సాగించి, 1929 లో ఆంగ్ల సాహిత్యంలో ఆనర్స్ పట్టభద్రుడైనాడు, భారతదేశంలో జరిగిన 'ఉప్పు సత్యాగ్రహం' మీద పరిశోధన సాగించి, జర్మనీ దేశంలోని బెర్లిన్ విశ్వవిద్యాలయం నుండి తన 22 వ ఏటనే డాక్టరేట్ పట్టా పొందాడు.

## కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపన

విద్యార్థి దశనుండి రాజకీయాలలో చురుకుగా పాల్గొన్న లోహియా, 1932లో జర్మనీ నుండి తిరిగి రాగానే దేశ సత్యాగ్రహ సమరంలో ఉత్సాహంతో ప్రవేశించాడు. నాసిక్ జైలులో నిర్బంధింపబడ్డ లోహియా, మిత్రులయిన జయప్రకాశ్ నారాయణ్, యూసఫ్ మెహరాలీ, అచ్యుత్ పట్‌వర్ధన్, అశోక్ మెహతా లాంటి యువ

ఎ. ఎస్. అవధాని

సింహాల తోడ్పాటుతో కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి స్థాపకుడైనాడు. "కాంగ్రెసు సోషలిస్టు" పత్రికకు సంపాదకుడైనాడు. కాంగ్రెసు విదేశాంగ శాఖకు పండిట్ నెహ్రూ అధ్యక్షుడు కాగా, లోహియా కార్యదర్శిగా వ్యవహరించాడు. ఈ అవకాశం ఆయనకు అంతర్జాతీయ సదవగాహన ఏర్పడటానికి ఎంతగానో తోడ్పడింది. 1936 లో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యుడైనాడు. దేశ వ్యాపిత పర్యటన జరిపి వేలాది యువకులను స్వాతంత్ర్య సమరంలోకి ఆకర్షించాడు. 1938 లో రాజద్రోహం నేరం క్రింద కలకత్తాలో అరెస్టయినాడు.

## 'క్విట్ ఇండియా'

1942 లో జాతిపిత గాంధీజీ బ్రిటిషువారిని దేశం విడిచి పొమ్మని పిలుపు ఇచ్చి ఉద్యమం ప్రారంభించగానే జాతీయ నాయకులందరిని బ్రిటిషు ప్రభుత్వం జైలులో పెట్టింది. "విజయమో వీరస్వర్గమో" అన్న గాంధీజీ వినాదాన్ని అమలుపరచటానికి నడుము కట్టిన సోషలిస్టు

వీరులు శ్రీయుతులు జయప్రకాశ్ నారాయణ్, డా॥ రామమనోహర్ లోహియా, అరుణ అసఫాలి, అచ్యుత్ పట్వర్ధన్, అశోక్ మెహత మొదలగువారు అజ్ఞాతవాసం చేపట్టి దేశ వ్యాపితంగా ఉద్యమాన్ని నడిపారు, శ్రీ లోహియా 'రహస్య ఆకాశవాణి' కేంద్రాన్ని నడిపి ఉద్యమాన్ని వుధృతం చేయటమే గాక, బ్రిటిషువారిని గడ గడ లాడించాడు 1944 లో అరెస్టయిన లోహియా జైలులో చిత్రహింసలకు గురైనాడు. చేతులకు కాళ్ళకు బేడీలు వేసి, రాత్రిళ్ళు నిద్రపోనీయకుండ యమయాతనలు పెట్టారు. 1946 లో విడుదలయినాడు.

## నిరంతర సత్యాగ్రహాలు

బ్రిటిషువారికన్న మిన్నగా నియంతృత్వం సాగిస్తున్న పోర్చుగీసువారి పరిపాలనకు వ్యతిరేకంగా గోవాలో ఉద్యమం ప్రారంభించాడు లోహియా. నేపాల్‌లోని రాజవంశ పరిపాలనకు వ్యతిరేకంగా యువకులను ఉత్తేజపరచి పోరాటానికి శ్రీకారం చుట్టాడు. కర్నాటకరాష్ట్రంలో రైతుల సత్యాగ్రహంలో పాల్గొన్నాడు.

1947 లో దేశం స్వాతంత్రం రావటం, 1948 లో గాంధీజీ హత్య కావింపబడడం జరిగాయి. ఆ తదుపరి కాంగ్రెసువారి విధానాలు నచ్చక సోషలిస్టులందరు సంస్థను విడిచి బయటకు నడిచారు. దేశంలో సోషలిస్టు ఉద్యమాన్ని బలంగా నిర్మించటానికి సాగిన కృషిలో లోహియా తన పాత్రను సమర్థవంతంగా నిర్వహించాడు. 1952లో కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి అధ్యక్షుడైనాడు. 1953 లో అయన చేసిన అవిరళ కృషి ఫలితంగా ఆసియా సోషలిస్టు మహాసభ భారతదేశంలో జరిగింది. కాంగ్రెసువారి విధానాలతో విసిగెత్తి బయటకు వచ్చిన శ్రీ కృపాలనీ, ప్రకాశం ప్రభృతులు సోషలిస్టులను కలుపుకుని ప్రజా సోషలిస్టు పార్టీ నిర్మించగా దాని కార్యదర్శిగా డా॥ లోహియా వ్యవహరించాడు. కేరళలో ఆ పార్టీ అధ్వర్యమున శ్రీ పట్టం థానుపిళ్లె ముఖ్యమంత్రిగా ఏర్పడిన ప్రభుత్వం, ప్రజలపై కాల్పులు జరుపగా, అందుకు అసమ్మతి తెలిపిన లోహియా ఆ ప్రభుత్వం రాజీనామా చేయాలని పట్టుపట్టాడు. ఫలితంగా ఆయన ఆ పార్టీ నుంచి బహిష్కరింపబడ్డాడు. 1955లో సోషలిస్టు పార్టీని పునరుద్ధరించి, సోషలిస్టులందరిని సమైక్యపరచి "మాన్ కైండ్" అన్న పత్రికను స్థాపించి నిర్వహించాడు. 1964 లో అమెరికాలో పర్యటిస్తూ తెల్ల జాత్యహంకారానికి వ్యతిరేకంగా అక్కడ సాగుతున్న నీగ్రోల ఉద్యమంలో పాల్గొని అరెస్టయినాడు. 1965 లో పూల్పూరు నియోజక వర్గంనుంచి జవహర్‌లాల్ నెహ్రూపై పోటీ చేసి నెగ్గలేకపోయినా, 1963 లో ఫరూకాబాద్‌లో జరిగిన బై - ఎలక్షనులో నెగ్గి పార్లమెంటులో అడుగు పెట్టాడు. ప్రభుత్వంలో నెహ్రూ విధానాలను అత్యంత నిశితంగా విమర్శించేవాడు. ఆర్థిక విషయాలపై సమగ్రమైన అవగాహన కలిగి, పూర్తి సంఖ్యావివరాలతో విశ్లేషణ జరిపి తన ప్రసంగాలతో పార్లమెంటు సభ్యులను చికితులను చేసేవాడు. అనాటి దేశప్రజల పేదరికాన్ని గురించి ఉటంకిస్తూ, లక్షలాది ప్రజల సగటు రాబడి రోజుకు 22 పైసలు మాత్రమే నన్న వాస్తవాన్ని వెల్లడించి అందరిని ఆశ్చర్యంతో ముంచాడు. అదే సమయంలో దేశ ప్రధాని నెహ్రూ భద్రతకు రోజుకు 25 వేలరూపాయలు ప్రభుత్వం ఖర్చు పెడతోందని తన నిశిత విమర్శనాబాణాలు ప్రభుత్వం మీద సంధించి వారిని నిరుత్తరులను చేసాడు.

## కాంగ్రెస్ వ్యతిరేకుల సమైక్యానికి పిలుపు

1967లో కనోజ్ నియోజకవర్గంనుంచి పార్లమెంటుకు తిరిగి ఎన్నికయినాడు. కాంగ్రెసు వ్యతిరేక రాజకీయవాదులంతా సమైక్యమై దేశాన్ని కాంగ్రెసు దుష్టపరిపాలన నుంచి విముక్తం చేయాలని పిలుపునిచ్చాడు. దురదృష్టవశాత్తు ఆ పిలుపు కార్యరూపం దాల్చేనాటికి అయన దివంగతుడైనాడు. 1967లోనే ఢిల్లీలో అయన కొక అపరేషను చేసారు. ఆ సందర్భంగా డాక్టర్లు అమానుషమైన నిర్లక్ష్యం చేసారని వదంతులు వ్యాపించాయి. ఇది

కావాలని చేసిన చర్యగా అప్పట్లో పుకార్లు వ్యాపించాయి. ఏమయితేనేం, ఆ రుగ్మతనుంచి బయటపడకుండానే ఆయన అంతిమశ్వాస వదిలాడు. 57 సం॥ వయస్సులోనే, చేపట్టిన ఉద్యమాలు సఫలంకాకముందే ఆయనకు నూరేళ్ళు నిండిపోయాయి. నిరంతరపోరాటవాదిగా ఆయన దేశప్రజల మనస్సులలో చెరగని ముద్రవేసి కనుమరుగై పోయాడు.

## అసదృశ వ్యక్తిత్వం

డా॥ లోహియాది అసదృశమైన వ్యక్తిత్వం. తన పూర్తికాలాన్ని దేశసేవకు అంకితం చేయాలనే ఆకాంక్షతో వివాహం చేసుకోకుండా అవివాహితుడుగానే ఉండి పోయాడు. స్వార్థమన్నభావమే లేకుండా ఏరకమైన అర్జనకు దిగకుండ, ఏ అస్థులు కూడపెట్టకుండ, నిరాడంబరంగా నిరంతర ప్రజాసేవ సాగించాడు. అధికారాలు, పదవులు, ఎన్నడు ఆశించినవాడు కాదు. దైనందిన జీవితంలోని ఖర్చులకుకూడ హితైషిలాషులు, స్నేహితులు ఇచ్చే ధన సహాయంమీదనే ఆధారపడ్డాడు. అటు మార్క్స్, ఇటు గాంధీజీ ఆయన్ని ప్రభావితం చేసారు. సామ్యవాదంపై అకుంఠిత విశ్వాసం కలిగి యుండి, మార్క్సిజంలోని లోపాలను బహిర్గతం చేయడానికి వెనకాడలేదు. మార్క్సిస్టులు బలపరచే హింసా విధానాలను తిరస్కరించి, గాంధీజీ ప్రవచించిన అహింసావాదాన్నే ఆమోదించి బలపరచాడు. సత్యాగ్రహ విధానాన్నే ఆదరించి అమలు పరచాడు. పెట్టుబడిదారీ విధానాన్ని, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తూ, మార్క్సిస్టులు సూచించే "స్టేట్ కాపిటలిజాన్ని" కూడ తూర్పారబట్టాడు. ప్రజాస్వామిక వికేంద్రీకరణకు తన అండదండల నందించాడు. ప్రజాస్వామ్యయుత సోషలిస్టు సమాజమే తన ధ్యేయమని ఎలుగెత్తి చాటి, ప్రపంచ సామ్యవాద సిద్ధాంతవాదులలో తనదైన ఒక స్థానాన్ని రూపొందించుకుని అందరి మన్ననల నందుకున్నాడు రష్యాలోను, తూర్పుయూరపు దేశాలలోను కమ్యూనిస్టు విధానాలలో ప్రజాస్వామ్యం వైపుగా వస్తున్న గణనీయమైన నేటి మార్పులు లోహియా ఆలోచనా పంథాలోని వాస్తవికతను ఋజువుచేస్తున్నాయి.

## దళిత వర్గాలపట్ల ఎనలేని అభిమానం

బహుశాస్త్రాలు మథించిన సాహితీ ప్రకర్ష సాంప్రదాయపు శృంఖలాలను ఛేదించే ఆలోచనా నైశిత్యం, పాండిత్యాన్ని చింతనను కార్యోన్ముఖంచేసే ప్రతిభ శ్రీలోహియాకు పెట్టని సొమ్ములు. వెనుకబడిన బలహీన వర్గాల పట్ల అత్యంతాదరాభిమానాలు కనపరచేవాడు. వారికి రిజర్వేషన్లు మాత్రమేచాలవు, ప్రత్యేక సౌకర్యాలు ఏర్పరచాలని వాదించేవాడు. హిందూమతంలోని కుల విభజనను తీవ్రంగా వ్యతిరేకించి అది సమూలంగా పెరికి వెయ్యాలనేవాడు. మన సమాజంలో స్త్రీలు రాజకీయ, సాంఘిక, ఆర్థిక రంగాలలో తమ సంఖ్యకు దీటుగా పాలుపంచుకోవటంలేదని, అందుకుగా వారి ను త్తేజపరచి ప్రోత్సహిస్తేనేగాని దేశాభివృద్ధి సంతృప్తికరంగాసాగి, ప్రజాస్వామిక సంస్థలు అర్థవంతంకాజాలవని అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. అసలు దేశంలో ప్రజాస్వామ్యం వెల్లివిరిసే సామాజిక వ్యవస్థ వర్థిల్లాలంటే అందుకు "జైలు - పార - బ్యాలటు పెట్టె" అన్న మూడు అంశాల పథకం అమలు జరిగితీరాలనేవాడు.

## నూతన రాజ్యాంగ వ్యవస్థ

మన దేశ రాజ్యాంగాన్ని మార్చి, నాలుగు అంతస్తుల నూతన వ్యవస్థను నిర్మించాలని డా॥ లోహియా సూచించాడు. అవి గ్రామ (పట్టణ), జిల్లా, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు. దేశపు ఆదాయంలో సగం, మొదటి రెండుస్థాయిల ప్రభుత్వాలకు కేటాయించ బడాలన్నాడు. అందులో గ్రామస్వరాజ్యం వర్థిల్లేటట్లుగా, ప్రాథమిక స్థాయి పరిపాలనా వ్యవస్థకు శిస్తులు వసూలు చేయటం, పన్నులువేయటం, పోలీసు శాఖల నిర్వహించటంలాంటి ముఖ్యమైన అధికారాలన్నీ దఖలు

## విదుర నీతి

"న కులం వృత్త హీనస్య
ప్రమాణమితి మేమతిః
అన్త్యేష్వపి హి జాతానాం
వృత్తమేవ విశిష్యతే"

మంచి ప్రవర్తన లేని మనిషికి కేవలం మంచి వంశం మాత్రమే, అతడు పూజ్యుడగుటకు ప్రమాణము కాజాలదు. నీచమైన కులములో పుట్టినను, మనిషికి మంచి ప్రవర్తన విశిష్టతను సంపాదించగలదు

కావాలన్నాడు ఈ విషయంలో డా॥ లోహియా, గాంధీజీ ప్రతిపాదించిన గ్రామస్వరాజ్యానికి అతి సన్నిహితంగా తన ఆలోచనలను సాగించాడు,

### జాతీయ భాషాభిమానం

ఇక ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలోకూడ, భారీయంత్రాల, పరిశ్రమలస్థానం పరిమితంగా ఉండాలని కోరాడు. సాధ్యమైనమేరకు పారిశ్రామిక వికేంద్రీకరణ జరిగి చిన్న యంత్రాలద్వారా వస్తూత్పత్తి సాగాలని, తద్వారా సంపద కేంద్రీకృతం కాకుండా విస్తృతంగా పంపిణీ జరగాలని అభిలషించాడు. ఈ విషయాలలోకూడ లోహియాకు, గాంధీజీకి, ఆలోచనా సరళిలో సన్నిహిత పోకడలు గోచరించేవి. దేశ వ్యవహారాలన్ని జాతీయ భాషలోనే జరిగితీరాలన్నది లోహియా దృఢసంకల్పం. ఆంగ్ల, ఫ్రెంచి, జర్మను భాషలలో గట్టి పాండిత్యమే ఉన్నా, మన దేశంలో ఇంగ్లీషుభాషకున్న ప్రాధాన్యతను ఆయన సహించేవాడుగాదు "అంగ్రేజి హటావో" అన్న ఉద్యమాన్ని ప్రారంభించి, "తారుడబ్బాలు – బ్రష్‌లు" తీసుకుని ఇంగ్లీషు సైనుబోర్డులన్నిటికి తారుపట్టించే ఉద్యమకారుల బృందానికి బొంబాయిలో తానే నాయకత్వం వహించాడు.

### జైలుకు వెళ్ళటంలో ప్రపంచ రికార్డు

గాంధీజీ తరువాత, సహాయ నిరాకరణ, సత్యాగ్రహాల నిర్వహణలో అగ్రగణ్యుడు డా॥ లోహియా ఆయన ప్రతిపాదించిన "నిరంతర సత్యాగ్రహ సిద్ధాంతం" రాజకీయ సిద్ధాంతానికి నూతన అధ్యాయాన్ని జోడించింది. రాజకీయ వుద్యమాలు నడిపి జైలుకు వెళ్ళడంలో కొత్త రికార్డునే స్థాపించాడు 57 సం॥ జీవితంలో 20 సార్లు జైలుకు వెళ్లాడు. స్వతంత్ర భారతావతరణం దరిమిలా కూడ 12 సార్లు వివిధ సత్యాగ్రహాలలో పాల్గొని చెరసాల నిర్బంధాన్ని అనుభవించినారు సాంఘిక న్యాయం కోసం నిరంతర పోరాటమే ఆయన జీవిత లక్ష్యం. ప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారుడు శంకర్, తన "శంకర్స్ వీక్లీ" లో ఒకసారి ఆయనపై ఒక కార్టూను వేసారు. కర్ర చివర ప్రదర్శన అట్టను (Play Cards) పెట్టి, దానిపై 'I am prepared to be arrested on any 'issue, అని వ్రాశాడు. ఇది తరచుగా జైలుకు వెళ్ళాలనే లోహియా వాంఛపై వ్యంగ్యంగా నవ్వటమే అయినా, అది ఆయన జీవితంలోని "సేవా - త్యాగ - పోరాట" నిరతిని ప్రస్ఫుటం చేసింది

### సంస్కృతి-వారసత్వాలపట్ల భక్తి శ్రద్ధలు

డా॥ లోహియా మత దురభిమాన వ్యతిరేకి మత ప్రాతిపదికపై దేశ విభజన జరగటాన్ని తీవ్రంగా ఎదిరించాడు. ఈ విషయంలో జవహర్‌లాల్ నెహ్రూ కన్న, డా॥ లోహియాయే గాంధిజీకి సన్నిహితుడుగా మెలిగాడు. ఆయనకు దైవంపై విశ్వాసం లేదని, "నాస్తికుడ"ని కొందరు విమర్శించినా మన సంస్కృతి, వారసత్వాలపట్ల ఆయనకెనలేని భక్తి, శ్రద్ధలుండేవి. కేవలం మతాచారాల పేరిట మూఢ విశ్వాసాలను ఆయన నిర్ద్వంద్వంగా ఖండించేవారు శ్రీరాముడన్నా, రామాయణ

( తరువాయి 36 వ పేజీలో )

# కొమరగిరి కారాగార లేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 8-3-1976

డియర్ బ్రదర్,

భగవంతుని దయవల్ల నేనింతవరకు కులాసాగానే యున్నాను. ది. 11-3-76 న మన విద్యానికేతన్ వార్షికోత్సవం జరుపుకుంటున్నందుకు చాలా సంతోషం. నేను లేకుండా జరుపుకుంటున్న వార్షికోత్సవం బహుశా ఇదే మొదటిదేమో? చిన్నప్పటినుంచి చదువు సంస్కారాలను నేర్పించి, అతి ముద్దుగా ప్రేమించి పెంచి పోషించిన తనయునకు జరుగుతున్న సన్మాన మహోత్సవానికి హాజరుకాలేని తండ్రి మనస్సు ఏవిధంగా పరితపిస్తుంటుందో, అదేవిధంగా నా మనస్సు ఈరోజు వ్యథ జెందుతున్నది.

ఈ సంవత్సరం నేను లేకపోయినప్పటికీ మిక్కిలి శ్రద్ధ తీసుకొని, కష్టపడి చదువుచెప్పి, వార్షికోత్సవాన్ని కూడ విజయవంతంగా నిర్వహిస్తున్న మన ఉపాధ్యాయ బృందానికి నా హృదయపూర్వకమైన అభినందనలు. క్రమశిక్షణతో కడు శ్రద్ధగా విద్య నభ్యసిస్తున్న బాల బాలికలకు నా ఆశీస్సులు.

ఈ సంవత్సరం మన విద్యానికేతన్‌లో 7వ తరగతిలో ఉత్తీర్ణులైన బాలబాలికలు వచ్చే సంవత్సరం మరొక విద్యాలయంలో విద్యనభ్యసించడానికి వెళ్ళవచ్చు. వారందరూ ఈ నీతి శ్లోకాన్ని పఠించి మననం చేసుకుంటూ, అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టి ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతూ చక్కటి భావి భారత పౌరులుగా తయారుకావాలని నా ఆకాంక్ష. నా ఆశయం.

" ఉద్యమం సాహసం ధైర్యం బుద్ధి శ్శక్తిః
పరాక్రమః
షడేతే యత్ర వర్తన్తే తత్ర దేవః
సహాయకః

ప్రయత్నము, సాహసము, ధైర్యము, బుద్ధి (సద్బుద్ధి), శక్తి, పరాక్రమము—అను ఈ ఆరు గుణములు కలవారికే దైవ సహాయము కూడ కలుగును. పై గుణములు లేనివారికి దైవ సహాయము కూడా వుండదన్నమాట. కనుక బాలబాలికలు ఈ ఆరు సద్గుణములను అలవరచుకొనాలి. నిత్య జీవితంలో ఆచరణలో పెట్టేవారికి పరాజయం అంటూ వుండదు. అన్నిరంగాలలో విజయలక్ష్మిని చేబట్టగలుగుతారు.

వీటితోపాటు మన విద్యానికేతన్ ఆదర్శాలను కూడ మరువరాదు. "విద్య, విజ్ఞానము, క్రమశిక్షణ, సచ్ఛీలము, దేశభక్తి" మన విద్యానికేతన్‌కు పట్టుగొమ్మలు. పిల్లలు వీటిని కూడ నిత్యజీవితంలో అలవరచుకొని ఆచరించాలి.

" విద్యా విహీనః పశుభి స్సమానాః " విద్య లేనివాడు పశువుతో సమానం అని పెద్దలు ఏనాడో చెప్పారు. మన పూర్వులు విద్యకు ఎటువంటి ప్రాధాన్యత యిచ్చారో గమనించండి. ' విద్య ' అంటే కేవలం చదవడం, వ్రాయడం కాదు. వినయ వివేకాది సద్గుణములను నేర్పునదియే విద్య. యుక్తాయుక్త వివేకమును కలిగించి తిన్నగా నడచుటకు ఉపయోగపడేదే సరైన విద్య. మంచిమార్గమున నడవగల శక్తినిచ్చునదియే సరైన విద్య. కనుక బాలబాలికలు లౌకిక విద్యతో పాటు వినయం, సత్ప్రవర్తన అలవరచుకోవాలి. దేశభక్తి.

భావాలను పెంపొందించుకోవాలి. క్రమశిక్షణ గల పౌరులుగా తయారుకావాలి. కనుక ఇటువంటి అత్యున్నతమైన ఆశయాలతో కూడిన విద్యను అభ్యసించాలని నా ఆకాంక్ష.

పై శ్లోకాలను ఊరికనే వల్లె వేసినందువల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు. ఆకళింపు చేసుకోవాలి, ఆచరణలో పెట్టాలి. పట్టుదల వుంటే వీటిని సాధించవచ్చు. అధైర్యం మాత్రం చెందరాదు. వీటిని సాధించగలమా ? లేదా ? అనే అనుమానం ఎవరి మనస్సులలో రాకూడదు. దేనినైనా సాధించితీరగలమనే ఆత్మవిశ్వాసం ప్రతి ఒక్కరిలో వుండాలి. ఆదర్శాలు వల్లె వేసినంతమాత్రాన ప్రయోజనం లేదు. కోరికలు నెరవేరవు. ఆశించిన ఫలితం చేకూరదు. ప్రయత్నముచే ఎటువంటి పనులనైనా సాధించవచ్చును. ఈ సందర్భమున ఒక చక్కని నీతిని బోధించే శ్లోకమును వ్రాస్తున్నాను.

“ ఉద్యమేన హి సిధ్యన్తి,
కార్యాణి న మనోరథైః
న హి సుప్తస్య సింహస్య,
ప్రవిశన్తి ముఖే మృగాః ”

పనులు ప్రయత్నము చేతనే సిద్ధించుచున్నవి. కోరికల చేత కాదు. ( వేటాడక ) నిద్రపోవుచున్న సింహము యొక్క నోటియందు జంతువులు వాటంతట అవే ప్రవేశించవు గదా ! సింహం మృగరాజైనప్పటికి వేటాడకుండ ఒక మూల కూర్చుంటే ఆహారం లభ్యం కాదు. అదే విధంగా ప్రయత్నం చేయకుండా భగవంతుని దయ వుంటే తప్పకుండా పాసవుతానులే అని కూర్చుంటే పరీక్ష ప్యాసుకావడం అసాధ్యం ప్రయత్నం చేయకుండా పరీక్ష ప్యాసవుతే దేవుడికి కొబ్బరికాయ కొడతామని మ్రొక్కుకున్నందువల్ల కూడా ప్రయోజనం లేదు. ఎవరి ప్రయత్నం వారు శక్తివంచన లేకుండా చేయాలి. ప్రయత్నం చేసేవారు మాత్రమే భగవదనుగ్రహానికి పాత్రులవుతారు. సోమరులను భగవంతుడు ఏమాత్రం హర్షించడు. కనుక బాలబాలికలు ప్రయత్నంలో ఏమాత్రం లోపం చేయరాదు.

సంస్కృతం అమృతభాష. భారతీయ భాషలన్నింటికి తల్లిలాంటిది. మన సంస్కృతికి నిలయం సంస్కృతం. సమస్త భారతీయ భాషలకు స్ఫూర్తికేంద్రం సంస్కృతం. అమరవాణి దానిలో వున్నది. ఈనాడు ప్రపంచంలోని అనేక దేశాలలో సంస్కృతం ప్రత్యేకంగా అధ్యయనం చేయబడుతున్నది. అటువంటి అమృత భాషను నేర్చుకోవాలనే తలంపు నాకు కల్గింది. ఒక విద్యార్థివలె నిత్యమూ నేనిక్కడ సంస్కృతాన్ని నేర్చుకుంటున్నాను. మా తరగతిలో నేనే అన్ని పరీక్షలలో ప్రప్రథమునిగా ఉత్తీర్ణుడవుతున్నాను. మీ అందరూ కూడా మంచి మార్కులు తెచ్చుకుంటారని ఆశిస్తున్నాను.

గౌ॥ అధ్యక్షులవారికి, విద్యాశాఖాధికారికి, ముఖ్యఅతిథికి వార్షికోత్సవానికి విచ్చేసిన తల్లిదండ్రులకు నా హృదయపూర్వకమైన అభినందనలు. జై భారత్ భవదీయ

(సం.) కొమరగిరి *

# మహామహుల హాస్యాలు

అలాన్ డైన్ అంటాడు "ప్రపంచంలో అతి అరుదు అయినది నవ్వు". అట్లాంటి నవ్వు విపరీతంగా పుట్టే హాస్యం ప్రసిద్ధ పురుషులలో చాలామందికి ఉన్నది.

అమెరికాలో రెండే పార్టీలు–రిపబ్లికన్, డెమోక్రాట్. ప్రఖ్యాత అమెరికా అధ్యక్షుడు థియోడోర్ రూస్‌వెల్టు రిపబ్లికన్ పార్టీకి చెందినవాడు. ఆయన ఒకసారి ఒక ఎలక్షను కాన్వాసింగులో ఉపన్యసించి చివరకు "కనుక మీరు అందరూ రిపబ్లికన్ పార్టీకే వోటు వెయ్యండి" అన్నాడు. శ్రోతలలో ఒక వ్యక్తి లేచి నిలబడి "మా తాత డెమోక్రాట్, మా నాన్న డెమోక్రాట్, నేనూ డెమోక్రాట్" అన్నాడు. ఉన్నుమండిన రూజ్‌వెల్టు "మీ తాత గాడిద, మీ నాన్న గాడిద అయితే నువ్వు ఏమి అయ్యేవాడివి?" అందుకు ఆ శ్రోత "అట్లాగు అయితే నేను రిపబ్లికన్నే అయ్యేవాడ్ని" అన్నాడు.

ఒకనాటి ఇంగ్లీషు ప్రధాని సర్ విన్‌స్టన్ చర్చిల్ హాస్యానికి ప్రసిద్ధుడు. ఒక మహిళ చర్చిల్‌తో అన్నదిట "మీరు కనుక నా భర్త అయితే విషం పెట్టేసేదాన్ని" అందుకు చర్చిల్ "మీరు కనుక నా భార్య అయితే నిక్షేపంగా తాగేసేవాడ్ని" అన్నాడు.

అబ్రహాం లింకన్ లాయరుగా వుండగా ఒకసారి తన మిత్రులతో హోటల్‌కు వెళ్ళేడు. అక్కడ అందరూ బాగా తిన్న తరువాత "బిల్లు ఎవరు యివ్వాలి" అన్న ప్రశ్న వచ్చింది. అందరూ ఒక నిర్ణయానికి వచ్చేరు. ముందు ఒకరు మరి ఒక అతన్ని ఒక ప్రశ్న వేయాలి. అడగబడినవారు ప్రశ్నకు జవాబు చెప్పలేకపోతే అడిగినవారు చెప్పాలి. అడిగినవాళ్ళు కూడా ప్రశ్నకు జవాబు చెప్పలేకపోతే అడిగినవాళ్ళే బిల్లు యివ్వాలి. అడిగినవారు ప్రశ్నకు జవాబు చెప్పితే అడగబడినవారు యివ్వాలి.

ముందు లింకన్ ప్రశ్న అడగవలసి వచ్చింది. లింకన్ అన్నాడు "అదుగో ఎలుక బొరియ. దానికి బయట మన్ను ఎందుకు లేదో తెలుసునా?" మిగిలిన వాళ్ళు అందరూ 'మాకు తెలియదు. నువ్వే చెప్పు'మన్నారు "ఎందుకు అంటే ఎలుక భూమి బయటనుండి బొరియ చేయలేదు. భూమి లోపలనుండే చేసింది కనుక" అన్నాడు. ఉండబట్టలేని మరి ఒక లాయరు "అసలు ఆ ఎలుక భూమి లోపలికి ఎట్లాగ వెళ్ళింది?" అని అడిగేడు. "అది నీ ప్రశ్న. నువ్వే సమాధానం చెప్పు"మన్నాడు లింకన్. బిల్లు ఆ లాయరు ఇచ్చుకోవలసి వచ్చింది.

**చింతపల్లి అన్నపూర్ణ**

మహాత్మాగాంధీ కూడా హాస్యంలో సుప్రసిద్ధుడే. 'హాస్య చక్రవర్తి'గా పేరు పొందిన ఛార్లీ ఛాప్లిన్ గాంధీగారితో కొంచెంసేపు మాట్లాడి పగలబడి నవ్వుకుంటూ బైటకు వచ్చేడు.

మహాత్మాగాంధీతో ఒకసారి ఎవరో అన్నారు "పాశ్చాత్య సంస్కృతి గురించి మీ అభిప్రాయం ఏమిటి?" (What is your opinion about Western Culture?) దానికి గాంధీ బదులిచ్చేడు. "అది మంచి ఊహ అని నా అభిప్రాయము (I think it is a good Idea)".

విన్‌స్టన్ చర్చిల్‌తో ఒక మహిళ అన్నది. "నాకు మీలో రెండు నచ్చవు. ఒకటి–మీ మీసాలు, రెండు–మీ సిద్ధాంతాలూ" అందుకు చర్చిల్ "మహిళామణీ! అవి రెండూ మీకు అడ్డు తగలవు" అన్నాడు.

# ప్రశ్నలు - సమాధానాలు

1. "పిసికల్చర్" అంటే ఏమిటి ?
2. తేనెటీగల పెంపకం గూర్చి చదివే శాస్త్రం ఏది?
3. మొక్కల పెంపకాన్ని వివరించే శాస్త్రం ?
4. తోటల పెంపకాన్ని తెలిపే శాస్త్రం ?
5. "మైకాలొజి" అంటే ఏమిటి ?
6. భారతీయ సాంస్కృతిక ఐక్యతకు తోడ్పడు భాష ఏది ?
7. మొదట భారత సమైక్యతను రాజకీయంగా సాధించిందెవరు ?
8. మన దేశంలోని పరమపవిత్రమైన నది ?
9. మన దేశంలోని పరమ పవిత్రమైన పుణ్య క్షేత్రం ?
10. ద్రావిడ భాషాకుటుంబానికి చెందిన భాష ఏది ?

1. చేపల పెంపకం 2. ఎపికల్చర్ 3. ఎబోరి కల్చర్ 4. హార్టికల్చర్ 5, శిలీంధ్రాలను గూర్చి చదివే శాస్త్రం 6. సంస్కృతము 7. మౌర్యులు 8. గంగానది 9. కాశి 10. తెలుగు

— తిరునగరి శ్రీనివాస్

ఇంగ్లండులో జోసెఫ్ మన్‌డే అనే పత్రికా సంపాదకుడు వుండేవాడు. ఒకసారి ఒక యువకుడు ఆయనకు "నేను ఎందుకు బ్రతికి వున్నాను" అనే పద్యం ఒకదాన్ని రాసి పంపించేడు. మన్‌డే దాన్ని తిప్పి పంపుతూ "ఎందుకా ? పోష్టులో పంపించేవు కనుక" అని రాసి పంపించేడు.

ప్రఖ్యాత ఐరిష్ రచయిత అస్కార్ వైల్డ్ హాస్యానికి సుప్రసిద్ధుడు. ఒకసారి వైల్డ్ యూరప్‌నుండి అమెరికా వెళ్ళేడు. అక్కడ కస్టమ్స్ అతన్ని "మీ దగ్గర విలువైన వస్తువులు ఏమైనా వున్నాయా ( Have you got anything to declare ) ?" అని అడుగగా వైల్డ్ "కేవలం నా మేథాసంపత్తి మాత్రమే ( only my genius )" అని బదులు ఇచ్చేడు.

వైల్డ్ అమెరికాలో ఒక యూనివర్సిటీకి ఉపన్యసించడానికి వెళ్ళేడు. వైల్డ్ ఎప్పుడూ పొడుగాటి జుట్టుతో, చేతిలో పువ్వులతో వుండేవాడు. అక్కడ అతన్ని ఏడిపించటానికి కొందరు విద్యార్థులు పొడుగాటి జుట్టుతో, చేతిలో పువ్వులతో వచ్చి ముందు సీట్లలో కూచున్నారు. వారి వైపు చూసి వైల్డ్ "అనుకరణే అన్నిటిలోకీ గొప్ప పొగడ్త (imitation is the best form of flattery)" అని ఉపన్యాసం మొదలుపెట్టాడు. వాళ్ళు అందరూ సిగ్గుతో తలలు వొంచుకున్నారు.

ప్రఖ్యాత ఐరిష్ రచయిత, నోబెల్ బహుమాన గ్రహీత అయిన బెర్నార్డ్‌షాకు ఇంగ్లీషువారు అంటే మహా కోపం. షా రాసిన "సెయింట్ జోన్" నాటకంలో ఒక వ్యక్తి చాప్లెన్‌తో అంటాడు. "నువ్వు కూడా ఇంగ్లీషువాడివే". అందుకు చాప్లెన్ "ఎంత మాత్రమూ కాదు. నేను మర్యాదస్తుడ్ని" ( No, I am an honest and a gentleman )" అంటాడు.

జాన్ విండ్‌సే న్యూయార్క్ మేయరుగా వుండగా ఎన్నో సమస్యలతో తలమునకలవుతూ వుండేవాడు. విండ్‌సే అప్పుడప్పుడు సినిమాలలో వేషాలు వేస్తూండేవాడు. ఒక సినిమాలో వేషం వేస్తుండగా దర్శకుడు విండ్‌సేతో అన్నాడు. "ఇప్పుడు మీరు చాలా ఏళ్ళ తరువాత మీ కూతుర్ని చూస్తారు. అప్పుడు మీరు ఏడుస్తారు. ఎట్లాగ ఏడవాలో చూపిస్తాను చూడండి" విండ్‌సే ఆయనతో అన్నాడు. "ఇన్ని సంవత్సరాల నుండీ న్యూయార్క్ మేయరుగా వుంటున్నాను. ఎట్లాగ ఏడవాలో ఎవ్వరూ నాకు నేర్పనక్కరలేదు"

ఇంగ్లండుకి చెందిన ప్రఖ్యాత క్రికెట్ ఆటగాడు, ఫాస్టుబౌలరైన హెరోల్డ్‌లార్‌వుడ్ ఆస్ట్రేలియాలో క్రికెట్ ఆడుతున్నాడు. లార్‌వుడ్ బౌలింగ్ చేస్తున్నాడు. ఎన్ని సార్లు అడిగినా బాట్స్‌మన్‌కి అంపైర్ అవుట్ ఇవ్వటం లేదు. ఒళ్ళు మండిన లార్‌వుడ్ బాట్స్‌మన్‌తో అన్నాడు. "అంపైర్ మీ నాన్నా ?" అందుకు ఆ బాట్స్‌మన్ అమాయకంగా సమాధానం చెప్పేడు "కాదండీ ఆయన మా బాబాయి".

రెండవ ప్రపంచ యుద్ధంలో ఇంగ్లండు, ఆస్ట్రేలియా సైన్యాలు ఇండియాలో వున్నాయి. అప్పుడు ఇంగ్లండు క్రికెట్ ఆటగాడు డెనిస్ కాంప్టన్, ఆస్ట్రేలియా క్రికెట్ ఆటగాడు కీత్‌మిల్లర్ ప్రత్యర్థులుగా కలకత్తాలో ఒక క్రికెట్ మేచ్ ఆడుతున్నారు. అప్పుడు భారత జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. అకస్మాత్తుగా భారతీయులు చాలామంది ఆ మైదానంలోకి వచ్చేరు. ఆ భారతీయ బృంద నాయకుడు బాటింగ్ చేస్తున్న డెనిస్ కాంప్టన్ దగ్గరకు వెళ్ళి వచ్చీ రాని ఇంగ్లీషులో అన్నాడు. "మిస్టర్ కాంప్టన్ యు ఎ గుడ్ ప్లేయర్. బట్ యు మస్ట్ గో (కాంప్టన్‌గారూ ! మీరు పెద్ద ఆటగాళ్ళు. కానీ మీరు వెళ్ళాలి)" అది ఆస్ట్రేలియన్ క్రికెట్ ఆటగాడు కీత్ మిల్లర్ విన్నాడు. తరువాత ఇంగ్లండుకీ, ఆస్ట్రేలియాకీ జరిగిన ఎన్నో క్రికెట్ టెస్ట్ మేచ్‌లలో మిల్లర్, కాంప్టన్ ప్రత్యర్థులుగా ఆడేరు. ఎప్పుడు కాంటన్ బేటింగుకి వెళ్ళినా మిల్లర్ అనేవాడు "మిస్టర్ కాంప్టన్ ! యు ఎ గుడ్ ప్లేయరు. బట్ యు మస్ట్ గో" అనేవాడు.

ప్రఖ్యాత సినీ నటుడు పీటర్ సెల్లర్స్ తన రీడింగ్ రూమ్‌లో చదువుకుంటున్నాడు. అతని భార్య వంట యింట్లో వున్నది అకస్మాత్తుగా డోర్ బెల్ మోగింది. ఆమె తలుపు తెరిచి చూస్తే ఆమెకు పీటర్ సెల్లర్ నుండి టెలిగ్రాం వచ్చింది "నాకు ఒక కప్పు కాఫీ తీసుకురా" అని. రీడింగు రూమ్‌లో వున్న పీటర్ సెల్లర్స్ వంట గదిలోని భార్యకు టెలిగ్రాం యిచ్చేడు ఒక కప్పు కాఫీ కోసం.

# మీనలోచని !

పరమ పావని మీనలోచని
కరుణ జూపుము మధురవాసిని !

దూరుసు మాటలు పలికినాడను
దురిత కర్మలు చేసినాడను
పరుల కేమీ మేలు సలుపక
తిరిగినాడను స్వార్థబుద్ధిని

వరము లిమ్మని కోర నెప్పుడు
పరము కోసము ప్రాకులాడను
కరుడు గట్టిన మనసు మురికిని
కరగజేసీ కావుమమ్మా

పరహితమ్మును కోరు బుద్ధిని
తిరము జేయుము నాదు గుండెను
శరణు వేడితి కనికరింపుము
సిరుల నెలవగు మధుర వాసిని !

— చల్లా రాధాకృష్ణశర్మ

ప్రసిద్ధ అమెరికా రచయిత మార్క్‌ట్వైన్‌తో ఒక సారి ఎవరో అన్నారు. "స్వర్గం, నరకం గురించి మీ అభిప్రాయం ఏమిటి ?" దానికి మార్క్‌ట్వైన్ బదులు యిచ్చేరు. "ఆ విషయం గురించి నేను ఏమీ మాట్లాడ లేను. నాకు రెండు చోట్లా మిత్రులు వున్నారు".

అందరిలోకీ అసలు విట్టు ప్రఖ్యాత ఐరిష్ రచయితా, నోబెల్ బహుమానగ్రహీత అయిన బెర్నాడ్‌షా వేసినది. బెర్నాడ్‌షా చెప్తాడు "నేను నవ్వించే విధానం ఏమిటి అంటే నిజం చెప్పటమే. దానికంటే నవ్వు వచ్చేది ప్రపంచంలో లేదు. (My way of joking is to tell the truth. It is the funniest thing in the world".)

ఇవి మహామహుల కొన్ని హాస్యాలు. 

# ప్రజా కవి వేమన

వేమన 1650 ప్రాంతంలో చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా మూగచింతపల్లి గ్రామములో జన్మించాడు. కొందరు పరిశోధకులు అనంతపురం జిల్లా కదిరి తాలూకాలోని కటార్లపల్లెర్లలో పుట్టాడని భావించారు. వేమన కాలం, ప్రాంతం విషయంలో పండితుల మధ్య విస్తృతమైన తర్జన భర్జనలు జరిగాయి. చరిత్రకోసం పండితులెంత పరిశ్రమ చేసినా వేమనకు చావనేది లేక ప్రజల నాలుకమీద యింకా బ్రతికే వున్నాడు. మొదటి ప్రజా విప్లవ కవి వేమన.

## జి. యస్. సాయినాథ్

సాంఘిక అధర్మాలనుండి మానవుని రక్షించడం వేమన ఆదర్శం. సాంఘిక దోషాలను సరిదిద్దడమంటే సమానత్వ సిద్ధాంతాలకోసం పోరాడాడన్నమాట.

అయితే మానవత్వ సాధనలో మొట్టమొదట వేమనకు అడ్డు తగిలింది వర్ణవ్యవస్థ. గుర్తు తెలియని కాలంనుండి కులవ్యవస్థ ఇండియాలో కొనసాగుచున్నది. హిందూ దేశంలో ఇలాంటి కులాలు మరెక్కడా లేవు. ఈవిధంగా అనాది కాలాలలో విడిపోయిన మానవులను మళ్ళీ ఏకం చేయుటకు అనేక ప్రయత్నాలు ఆ యా యుగాలలో జరిగాయి. కాని ఫలితం కొంతే ;

వేమన కూడా వర్ణవ్యవస్థ పునాదులలో ప్రకంపనము పుట్టించే ప్రయత్నం తన పద్యాల ద్వారా చేశాడు.

కులము హెచ్చు తగ్గు కొదవలు పనిలేదు
సాను జాతిమయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాటలెట్లురంగగ వచ్చు
విశ్వదాభిరామ ! వినురవేమ !!

మానవుని జాతియంతా భగవంతుని సంతానం కాగా కులాలెక్కడున్నాయి. కాబట్టి మానవజాతి సంఘటితం కావాలి. కులాలన్ని ఒకే కులంగా మారాలి. అదే మానవ కులం అదే దేవుని కులం. దానికి నానాజాతి సహపంక్తి భోజనం వంటివి తోడ్పడాలి.

ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తుగుడిపి కులము పొలయజేసి
తనను చెయ్యిబెట్టి తగనమ్మ చెప్పరా
విశ్వదాభిరామ ! వినురవేమ !!

"కులముకన్న మిగుల గుణము ప్రధానంబు" అని అందరు గుర్తించాలి.

కులాల పరిస్థితి యిట్లుంటే; మరొక సాంఘిక శాపం అస్పృశ్యత. చతుర్వర్ణాలకు వెలిగా పుట్టిన అస్పృశ్యత సాంఘిక అధర్మానికి చిహ్నం. అస్పృశ్యుల జీవితాలు మానవ హైన్యానికి భీకర తార్కాణాలు. పై నలుగురూ సంఘంలో పొందుతున్న గౌరవాదరాలు లేక అన్నింటికీ బాహ్యులుగా వున్న అస్పృశ్యుల దుస్థితి అతనికి క్రోధాన్ని రగుల్కొల్పింది. తర్కయుద్ధంతో వారి పక్షాన వాదించాడు.

మాలవానినేల మరి మరి నిందింప
ఒడల రక్తమాంస మొకటిగాదె
వానిలోని వెలుగు వాని కలంబేది ?
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

ప్రవర్తన చేతనే మాల గాని, జన్మచేత ఎవడూ మాల కాదు.

కసవు నేరి తిన్న పసరవుయైదిన
మాలడం(డు వాని మహిని జనులు
పంది కోడి తిన్నా (ప్రాజ్ఞులందురు జనుల్
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

మనిషికి బలమైన కుటుంబ వ్యవస్థను వేమన వాదించాడు. సంసార యోగాన్ని ప్రతిపాదించాడు.

వెతల దీర్చువాడు వేదాంతవేద్యుడు
రతులనేలువాడు రసికుడగును
సతిని పెనుగాడువాడు సంసారయోగిరా
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

విట జీవితం సంసారులకు తగదనీ, సంఘానికి హాని కరమని ఎలుగెత్తి చాటాడు.

యింటి యాలి విడిచి యిల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగె ఏరినట్లు
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

పేదవారు వేశ్యలలో చిక్కి మంటలో శలభాలవలె మాడిపోతున్నారు. వారకాంతల వలపు నిజమయినది కాదు. వారి (పేమ ధనంమీద. ఇది తెలియక మాయలో పడ్డవారు కళ్ళు తెరవక తప్పదు.

వారకాంతలెల్ల వలచి యేతెంచురా
పొందుజేసి ధనము పుచ్చుకొరకు
మారకమ్మడొచ్చి మరి యిలు వెల్లునా
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

మానవుడు జ్ఞానమార్గాన్ని అనుసరించాలని వేమన (ప్రయత్నము. చనిపోయిన వ్యక్తి భూతలం వీడి పితృ లోకాలలో ఉంటాడని హిందువుల నమ్మకం. ఈ విష యంలో వేమన దృష్టి వేరు. తల్లిదండ్రులు బ్రతికి వున్నప్పుడు సుఖపెట్టక, చెల్లిపోయిన తర్వాత కల్లబొల్లి మాటలు చెబితే వారివి నమ్మరాదు.

జీవి పోకముందె జీవ వస్తువులిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలగు వెనక జీవవస్తువులేల
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

విప్రులెల్ల చేరి వెర్రికూతలు కూసి
సతిపతులను గూర్చి సమ్మతమున
మునుముహూర్తముంచ ముండెట్లు మోసెరా
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

ధర్మార్థ కామములను (త్రివర్గమంటారు. వీటికి పురుషార్థములని పేరు. ఈ మూడు వర్గాలకి మోక్షము వచ్చి చేరి చతుర్విధ పురుషార్థాలు ఏర్పడక ముందు త్రివర్గమే (ప్రచారములో ఉండేది. పై (క్రమములో అర్థపురుషార్థానికి ద్వితీయస్థానం లభించింది. ధర్మార్థ కామాలు యిహలోకానికి సంబంధించినవి. మోక్షం పరమార్థం. మోక్షాన్ని సాధించడానికి పై పురుష(త్రయం సాధనాలు. ద్వితీయ తృతీయ పురుషార్థాలు ప్రథమ పురుషార్థానికి లోబడి అంటే, ధర్మబద్ధంగా నడవాలని భారతీయ దార్శనికులు నిర్ధయించారు. వారి దృష్టిలో ధర్మమే ముఖ్యం.

సాంఘిక భేదాలనే ఒప్పుకోని వేమన ఆర్థిక అసమాన తను అంగీకరిస్తాడా ? ధనం వలన వచ్చే దుర్గుణాలను ఖండించాడు. ధనంతోబాటు మానవతను కూడా అలవరచు కొమ్మని అతని ఆరాటం. దానికి దాతృత్వం ఒక మంచి మార్గం. లేనివాడిని ఆదుకోవడం ఉన్నవాడి ధర్మం. అయినా సంపదలకు మూలం శ్రమ అని అతడెరుగును.

భూమిలోన బుట్టు భూసారమెల్లను
తనువులోన బుట్టు తత్వమెల్ల
(శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

కాబట్టి శ్రమించే వాడికి ఫలం తప్పకుండా కావాలి. దానికి మానవతాదృష్టి వుండాలి. ధనిక పేద అంతరాలు తొలగిపోవాలి. ధనవంతులు పేదవారు కలసి వియ్యమంది సమానతను సాధించాలి. ధనవంతులకు వేమన ప్రబోధం ఒక్కటే, దానగుణం. ప్రపంచములో సాంఘిక మూల్యమే కాని ఆధ్యాత్మిక దృష్టిలో ధనానికి విలువ లేదు. సంపదల అస్థిరత్వాన్ని బతుకు యొక్క క్షణికత్వాన్ని తెలుసుకోవాలి.

ఏమి గొంచువచ్చె నేమి దా గొనిపోవు
పుట్టువేళ నరుడు గిట్టువేళ
ధనములెచటికేగు దానేగు నెచటికి
విశ్వదాభిరామ ! వినుర వేమ !!

"ధనము ఎవరి సొమ్ము ధర్మమే తన సొమ్ము" అని వేమన నమ్మకం. కాబట్టి దాతృత్వాన్ని మించిన సుగుణం లేదు. దానంచేయనివాడు ధర్మంగా లేనివాడే. కాబట్టి మానవత్వమే ధర్మం. అన్ని ధర్మాలసారం తోటివారిని ప్రేమించడమే !

వేమన జాతిని అనైక్యపరచే కులవ్యవస్థను ఖండించాడు. మూఢనమ్మకాలను గేలిచేశాడు. అమానుష ఆధారాలన్నిటిని తూర్పారబట్టాడు. సర్వమానవ ప్రేమ కోసం ఎలుగెత్తి అరచాడు. దీనికోసం ఎన్ని కష్టనష్టాల పాలయినా లెక్కచేయలేదు. కాని వేమన తర్వాతి కాలంలో అంటే మూడువందలేండ్ల తర్వాత కూడా యివి వున్నాయి. వేమన ధర్మాగ్రహజ్వాలతో వెలిగించిన యీ కాగడాను మనం గ్రహించాలి. నిరాశామయ చీకట్లను పటాపంచలు చెయ్యాలి.

రండి ! నడుం బిగించుదాం. మనకివే వేమాళి వందనాలు !

-0-

# మీ కు  లు సా ?

* ప్రపంచం మొత్తంమీద 2796 భాషలకంటే ఎక్కువ లేవని ఫ్రెంచి అకాడమీ అంచనా.
* "టురిన్ పాపిరస్" అనేది అతిపురాతనమైన దేశపటం. ఇది ఈజిప్టులోని వాడిహమ్మమత్ వద్ద గల బంగారు గని గుర్తులను తెలియజేస్తుంది. ఇది క్రీ. పూ. 1170 సంవత్సరాల నాటిది.
* డెన్మార్క్‌లోని కోపెన్ హాజన్ టౌన్‌హాల్‌లో వున్న 'ఓల్‌సెన్‌క్లాక్' ప్రపంచంలో ఖచ్చితమైన టైంను చూపుతుందట. 14,000 భాగాలు కలిగిన ఈ గడియారాన్ని చేసేందుకు 10 సంవత్సరాల కాలం పట్టిందట.
* మనిషి శరీరంలోని ఎర్ర రక్తకణాలలో మూడు వంతులు, నాలుగు నెలలలోపు సమయంలోనే నశించి మరల కొత్త ఎర్ర రక్తకణాలు పుట్టడం జరుగుతుంది.
* మొదటి ప్రపంచ యుద్ధం మొదలయ్యాక 1939 సెప్టెంబర్ 6 వ తేదీన మొట్టమొదట బ్రిటన్‌మీద దాడి జరిగింది.
* ఐసలాండలో అగ్నిపర్వతం బద్దలయితే రాళ్ళు వచ్చి వేయి మైళ్ళ దూరానవున్న ఇంగ్లాండులో పడతాయి.
* మనదేశంలోని జాతీయ బ్యాంకుల్లో ఒకటైన సిండికేట్ బ్యాంక్, కుక్కకు పెద్ద పీటవేసింది. కుక్కను బ్యాంకు అధికారచిహ్నంగా వారు ఎంపిక చేశారు. "స్నేహంగా, విశ్వాసంగా" అనే మాటలు చిహ్నంకింద వుంటాయి.
* కాలిఫోర్నియాలో జరిగిన ఏక నడక ( ఎక్కడా ఆగకూడదు ) పందెంలో ఓ యువకుడు రెండు రోజుల్లో 121మైళ్ళు నడిచాడు. ఇంకో యువకుడు ఆరు రోజుల్లో 531 మైళ్ళు నడిచాడు. ఇవి ప్రపంచ రికార్డు.

# గీత - అమృతవర్షి

శ్లో॥ శ్రేయాన్స్వధర్మోవిగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥

—ఈ శ్లోకము గీతా గంగలోని ఉత్తుంగ తరంగమని చెప్పక తప్పదు. వర్ణాశ్రమ ధర్మములను దృష్టి నందిడుకొని అనేకమంది వ్యాఖ్యాతలు ఈ శ్లోకానికి కులాల కుచ్చులను గుచ్చి అలంకరించారు. కానీ ఇది అద్వైత సుధాస్రవంతి. అగాధ అంతరార్థ ప్రబోధనిధి. ఇందు స్వధర్మము, పరధర్మము అని రెండు విషయములు చెప్పబడినవి. స్వధర్మమనగా వారి వారి కులములకు సంబంధించిన ధర్మములని, పరధర్మములనగా అన్య కులములవారి ఆచరణ ధర్మములని ప్రతీతి. ఇది కాదు సరియైన విధానము.

'స్వ' అనగా ఆత్మ. స్వధర్మము అనగా ఆత్మ ధర్మము. 'పర' అనగా లోకము, లేక సృష్టి. 'పర ధర్మము' అనగా ప్రకృతి ధర్మము, లేక దేహ ధర్మము అని అర్థము. "శ్రేయాన్స్వధర్మోవిగుణః" అంటే తన వర్ణము (కులము)నకు సంబంధించిన ధర్మము గుణములేనిదైననూ శ్రేష్ఠము—అని అర్థము కాదు. ఈ అర్థము వ్యర్థము. 'విగుణః' అనగా గుణము లేనటువంటి, గుణరహితమైనటువంటి 'స్వధర్మ' ఆత్మ ధర్మము 'శ్రేయాన్' శ్రేయస్సును, అనగా పునరావృత్తి రహిత స్థితిని ప్రసాదించగల దివ్యత్వము గలది అని అర్థము.

దేహ ధర్మాదులు (పర ధర్మములు) ఆచరించుటకు సులభము. ఆహార, నిద్ర, భయ, మైథునాదికములు దేహ ధర్మములు. వీటిని ఆచరించుట సులభము. ఐననూ ఈ పర (దేహ) ధర్మములు భయావహములు. అనగా జనన, మరణ శృంఖలముల తగిలించునవి. ఆనందస్థితిని హరించునవి. కావున దేహ ధర్మము భయంకరమైనది—అని అన్నారు. "స్వధర్మే నిధనం శ్రేయః." అనగా గుణములేనిదైననూ తన కులాచారము నాశ్రయించి దానియందు మరణించిననూ మంచిదే అని ప్రతీతి. అట్లు కాదు—'స్వధర్మే' ఆత్మ ధర్మమునందు 'నిధనం' అహంకార రూపక, జీవత్వ రూపక మరణము

సాయి గంగా మహాదేవ్

"శ్రేయః" శ్రేయస్కరము అని అంతరార్థము. అనగా ఆత్మ ధర్మము ననుసరించువాడు తన అహంకారమును, తాను జీవుడను భ్రాంతిని ఆత్మవాకిలిముందు హతం చేయవలసి ఉన్నది దానివల్లనే శ్రేయస్సు సిద్ధించగలదు.

తాత్పర్యమేమనగా : ఆచరించుటకు సులభముగా వుండిన దేహధర్మము(ల)కన్నా, గుణరహితమైన ఆత్మ ధర్మమే మోక్ష కారకము. భయజనకమైన జనన, మరణాదుల కలిగించు దేహధర్మముకన్నా, స్వధర్మమను ఆత్మధర్మ హోమగుండమున జీవత్వమును హతముచేసి నిలుచుటే శ్రేయస్సాధనము—అని అంతరార్థము.

భగవద్గీత ద్వైతార్థ ప్రబోధిని కాదు. అద్వైత మధుర ప్రబోధ సుధాస్రవంతి. ఇది అద్వైతామృత వర్షిణి, స్వస్వరూప దిశాసంకర్షిణి, ఆత్మానంద హర్షిణి, అశాంతినుంచి దూరము చేయుటకు గీతయే భగవానుని దూత, గీతయే జగదేకమాత, గీత సాధ(కు)నకు ఊత, గీత సంసారికొక ఈత, గీతయే మంత్రాల మూట, గీతయే వేదాంత వూట, గీతయే ఘనరాజ బాట, గీతయే పుష్పాలబాట—ఇది మన సత్యసాయీశ్వరుని మాట, అనుగ్రహపు కోట.

# వల

పోలాడి వెంకటరావు

## అప్పటికి సెకెండ్ షో వదిలి అరగంట దాటింది.

**రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. వీధిలైట్ల వెలుతురులో నగరమంతా పెళ్ళివారిల్లులా ధగధగా మెరిసిపోతోంది.**

ప్యాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని సన్నగా ఈలపాట పాడుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నాడు విశ్వామిత్ర.

ఇంతలో ఎక్కడినుండో "రక్షించండి .... హెల్ప్‌మీ" అంటూ ఓ అబల ఆర్తనాదాలు వినిపించాయి విశ్వామిత్రకు. ఆ అరుపులు అతి దీనంగా వున్నట్టనిపించాయి అతనికి.

వెంటనే ఓ క్షణం అక్కడే నిలబడిపోయి, ఆ అరుపులు ఏవైపు నుండి వినిపిస్తున్నాయో గమనించాడు విశ్వామిత్ర.

ఆ అరుపులు ఎడమవైపు సందులో నుండి వినిపిస్తున్నాయని గ్రహించి అటువైపు గబగబా నడవసాగాడు విశ్వామిత్ర పెద్దపెద్ద అంగలేసుకుంటూ.

దాదాపు పాతిక గజాలు నడిచేసరికి కనిపించిందా దృశ్యం విశ్వామిత్రకు.

ఇద్దరు యువకులు ఓ అబలపై అత్యాచారం జరుపబోతున్నారు, బలవంతంగా.

ఆ అబల అరుస్తూనే వుంది యింకా గట్టిగా, దీనంగా.

విశ్వామిత్ర పరిగెత్తుతూ వారిని సమీపించే సమయానికి ఆ యువకులిద్దరూ అతడ్ని గమనించి పారిపోయారు ఆ అబలను వదిలిపెట్టి.

పరిగెత్తుతున్న ఆ యువకులను పరీక్షగా చూశాడు విశ్వామిత్ర. ఆ యిద్దర్లో ఒకడు నల్లప్యాంటు ఎర్రచారల షర్టు వేసుకుంటే మరొకడు తెల్లప్యాంటు నల్లషర్టు వేసుకుని వున్నాడు.

ఆ యువతి గుడ్డలు సవరించుకుంటూ చెప్పింది కృతజ్ఞతగా విశ్వామిత్రతో. "థాంక్సండీ. మీరు రాకపోతే ఈరోజు నా జీవితం ఆ వెధవల చేతిలో నాశనమైపోయేది" అని.

"నో మెన్షన్. వాళ్ళు ఏమైనా ఎత్తుకుపోయారా మీ నగలు డబ్బు వగైరా" అడిగాడు విశ్వామిత్ర ఆవిడ్ని.

"ఏమీ పోలేదు. వాళ్ళ నగలకోసం రాలేదు" తల వంచుకుని చెప్పింది ఆమె.

"ఇట్సాల్‌రైట్. ఇంతకూ మీ యిల్లెక్కడ" అడిగాడు.

"శాంతినగర్" చెప్పిందావిడ.

"అంటే ఈ పక్క వీధేగదా! పదండి అక్కడిదాకా వచ్చి దిగబెడ్తాను" చెప్పాడు విశ్వామిత్ర.

"థాంక్స్" అని అతడ్ని అనుసరించిందావిడ.

ఇద్దరూ కొద్దిదూరం నడిచి శాంతినగర్ చేరాక అడిగాడు "మీ యిల్లెక్కడ". "అదిగో ఆ కన్పించేదే" చెప్పిందామె.

"అయితే యిక వెళ్ళండి. నే నిక్కడే వుంటాను మీరింట్లోకెళ్ళేదాకా" అన్నాడు విశ్వామిత్ర.

"ప్లీజ్. యింటిదాకా రండి. నాకు చాలా భయంగా వుంది." దీనంగా వేడుకుందామె.

" అయితే పదండి " అని ఆమె యింటిదాకా వెళ్ళాడు విశ్వామిత్రి.

గేటు దగ్గర నిల్చొంది "యిక నే వెళ్తాను" అన్నాడు ఆమెతో.

" దయచేసి లోపలిదాకా రండి. నన్ను రక్షించి ఈ రోజు నా జీవితాన్నే కాపాడారు. కాసిన్ని మంచినీళ్ళయినా తాగి వెళ్ళండి " చేతులు జోడించిందామె.

" సరే. పదండి " అంటూ ఆమె వెనుకే యింట్లోకి నడిచాడు విశ్వామిత్రి.

ఇంటి లోపల ఎవరూ ఉన్నట్టు కన్పించలేదు విశ్వామిత్రికి. కానీ తలుపులు తెరిచి లైట్లువేసి ఉన్నాయి. ఆశ్చర్యంగా అటూ ఇటూ చూడసాగాడు.

"ప్లీజ్. కూర్చోండి" అంటూ కుర్చీ చూపించిందామె.

" ఇంట్లో ఎవరూ లేరాండీ " అడిగాడామెను అనుమానంగా.

"ఎందుకులేమూ ! మేమున్నాంగా" అంటూ యిద్దరు యువకులు అకస్మాత్తుగా పక్కగదిలో నుండి దూసుకొచ్చారు.

వారిని చూడగానే అవాక్కయిపోయాడు విశ్వామిత్ర. వాళ్ళు యింతకుముందు ఆ యువతిని మానభంగం చేయబోయి తనను చూసి పారిపోయినవాళ్ళు ! అవే షర్టులు, ప్యాంట్లు !!

అతడు ఆశ్చర్యం నుండి తేరుకొనేలోపే ఆ యిద్దరు యువకులు చెరో చేయి పట్టుకుని గట్టిగా బంధించారు విశ్వామిత్రిని.

" అయితే ఇదంతా నాటకమన్నమాట " మనసులో అనుకున్నాడు విశ్వామిత్రి.

ఆ యువతి చిరునవ్వుతో వచ్చి ఎదురుగా నిలబడి పూర్ ఫెలో ! నా అరుపులు విని హీరోలా వచ్చి రక్షించాననుకున్నావుగదూ ! " అంటూ అతడి షర్టు జేబులో చేతులు పెట్టి డబ్బులు బయటికి తీసింది. తర్వాత

## ఆశ

ఆశ
అగుపడని నిషా
ఇది సుఖదుఃఖాల తమాషా
అపరిమితమైన ఆకాంక్ష
ఆశకు చావు లేదు
ఆశ లేని తావు లేదు
ఆశ దాల్చని రూపు లేదు
ఆశన్నది అభివృద్ధికి చిహ్నం
అలాగని
ఆశను పెంచుకోవద్దు
ఆశకు కల్పించాలి ఓ హద్దు
దాటనీయొద్దు ఆశను ఆ సరిహద్దు
ఆశ సరిహద్దులో ఉంటే మరి ముద్దు.
ఆశ
అత్యాశని పుట్టిస్తుంది-
మితాన్ని అతిగా రెట్టిస్తుంది
దురాశ వివేకాన్ని తొలగిస్తుంది-
దుఃఖాన్ని కలిగిస్తుంది
నిరాశ నీరసాన్ని వెలిగిస్తుంది-
నిస్పృహకు నీడనిస్తుంది
అందుకే....
ఓ మానవుడా !
ఆశను పెంచుకోకు - తుంచు
అదుపులో వుంచు
అభివృద్ధిని సాధించు
ఆనందంగా జీవించు.

— శ్రీవాణి శ్రీనాథ్

ప్యాంటు జేబులో నుండి కూడా కొంత డబ్బు బయటికి తీసింది.

"ఇంకా ఏమైనా వున్నాయా ?" అడిగారు వాళ్ళిద్దరూ ఆమెని.

"లేవు" అందామె.

"అయితే వీడ్ని వదిలేద్దామా యిక" అడిగారు వాళ్ళు.

"వద్దు. వీడు మనల్ని చూశాడు. తర్వాతెప్పుడైనా గుర్తుపట్టగలడు. వీడ్ని సఫా చేయడమే మంచిది" అందామె అతి మామూలుగా.

"అలాగా ! అయితే యిప్పుడు మేమూ చూశాము. మరి మమ్మల్ని కూడా సఫా చేస్తారా ?" అంటూ బిలబిలమని వచ్చారు ఆరుగురు కానిస్టేబుళ్ళు, ఒక యస్. ఐ. ఆ మాటలంది యస్. ఐ.

ఈసారి ఆశ్చర్యపోవడం ఆ యువతి వంతయింది.

యువకులిద్దరూ విశ్వామిత్రను వదిలి పారిపోవడానికి ప్రయత్నించారు. కానీ పోలీసులు వారిని పట్టుకుని బేడీలేసారు క్షణాల్లో.

"చూడండి ! నేను ఈ యేరియా సి. ఐ. ని. గత కొన్ని నెలలుగా మీరు యిలా నాటకమాడి కొంతమంది యువకుల్ని, అమాయకుల్ని దోచుకున్నది చాలక మరికొంతమందిని చంపేశారు కూడా ! నేను మీ కొరకు నెలరోజులుగా యిలా రాత్రుళ్ళు మఫ్టీలో తిరుగుతున్నాను, ఈరోజు మీ పాపం పండి నా కళ్ళబడ్డారు. ఇదంతా మా ప్రీప్లాన్ వ్యవహారం. పోలీసులు మీ కంటే తెలివైనవాళ్ళని మీకు యిప్పటికైనా తెలిసిందనుకుంటాను కదూ !" అంటూ ముందుకు నడిచాడు సి.ఐ. విశ్వామిత్ర.

అతడ్ని అనుసరించారు యస్సై మరియు కానిస్టేబుల్స్ ఆ ముగ్గురు దొంగలతో సహా.



# భర్తృహరి



ఒక పర్యాయము భర్తృహరికి ఆరు దినముల వరకు అన్నము లభించలేదు. అయినను ఆయనకు రాజ్య సుఖములు తృణప్రాయముగా త్యజించినందున దైన్యము ఏమాత్రమును కలుగలేదు. ఆరవ రోజున ఆయన తిరుగుతూ తిరుగుతూ స్మశానమునకు వెళ్ళిరి. అచట నొక శవము దహనము జరిగి కొంచెమగ్నికణములు మిగిలి యుండెను. భర్తృహరి ఆ అగ్ని సమీపముననున్న మూడు పిండి ముద్దలను తీసుకొని ఆ యగ్నిలో పడవేసి రొట్టెలుగా కాల్చుచుండెను. ఆ సమయమున పార్వతీ పరమేశ్వరులు ఆకాశమార్గమున విమానంపై విహరించుచు అచటికి చేరిరి విమానమునుండియే శంకరుడు భర్తృహరికి నమస్కరించెను. ఇది గాంచిన పార్వతి "మీరెవరికి నమస్కరించుచున్నారు ?" అని అడుగగా భర్తృహరిని జూపుతూ ఆయనకు నమస్కరించితినని చెప్పెను శంకరుడు అంతట ఆయనను తాను చూడవలెనున్నదని పార్వతి యనగా — ఆయన దర్శనము చేయదలచి ఇరువురును విమానము దిగి భర్తృహరి మహారాజు వెనుక భాగమునకు చేరిరి. "భిక్షాందేహి" యని అడిగెను శంకరుడు. ఈ శబ్దములు విని భర్తృహరి ముఖమునటు త్రిప్పకనే కాలుతూన్న రొట్టెను చేతితో తీసి తన వీపు పైనుంచి అతిథికి అందించెను. ఆ సమయమున పార్వతి చెప్పెను "శంకరభగవానుడు సాక్షాత్తుగా నీ వెనుక భాగముననున్నాడు నీకు కావలసిన వరమును కోరుకొనుము." అప్పుడు భర్తృహరి "స్వామీ ! తమరిచ్చట నుండి దయ ఉంచి వెళ్ళిపోవుటయే నా కోరిక" అనెను. ఇది విని తాము కూడా ఉపేక్షింపబడినందుకు, పార్వతీ పరమేశ్వరులు సంతోషమున మరలి వెడలిరి.

— తాటికొండ తిరుపతయ్య

# స్త్రీ స్థానం ఏమిటి ?...

సాయిప్రియ




"ముదితల్ నేర్వగరాని విద్య కలదే, ముద్దార నేర్పించినన్" అన్నారు ఒక ప్రబంధ కవి. ఆడవారు తలుచుకుంటే చేయలేని పని ఏదీ లేదు. దేనినైనా సాధించగలరు, నేర్వగలరు. మన సనాతన సమాజంలో స్త్రీకి ప్రత్యేకమైన స్థానం కలదు. మన పురాణ, ఇతిహాస, చరిత్ర పుటలను త్రిప్పుతే స్త్రీయొక్క ప్రాధాన్యత ఎంతటిదో అవగతమవుతుంది. అత్యున్నత స్థాయికి తీసుకొనివెళ్ళినా, అధోగతికి తీసుకొనివెళ్ళినా మూలకారణం స్త్రీయేననే విషయం ఋజువవుతున్నది.

గతమును పరికిస్తే ఎంతోమంది స్త్రీ రత్నాలు కనిపిస్తారు. సీత, సుమిత్ర, సావిత్రిలాంటి పతివ్రతలు కోకొల్లలు. మైత్రి, గార్గేయి, శాండిలీదేవిలాంటి విదుషీమణులు, సక్కుబాయి, మీరాబాయిలాంటి దైవ భక్తులు, ఝాన్సీ, రుద్రమ, నాగమ్మలాంటి వీర నారీమణులు, జిజియాలాంటి వీరమాతలు, మొల్లలాంటి కవయిత్రిలు ఎందరో కనిపిస్తారు. మరెందరి కంఠాలో వినిపిస్తాయి. వారు చూపిన ప్రతిభ, చేసిన త్యాగం చిరస్మరణీయం. ప్రస్తుత సమాజంలో కూడా అనేక రంగాలలో తమ ప్రతిభను చాటిన చాటుతున్న స్త్రీ రత్నాలు ఎందరో ! మరెందరో ! సరోజినీనాయుడు, విజయలక్ష్మి పండిట్, దుర్గాబాయిదేశముఖ్ ఇందిరాగాంధీ, కమలాదేవి ఛటోపాధ్యాయలాంటివారు మచ్చుతునకలు. వీరు అన్నిరంగాలలో చాలా ప్రఖ్యాతి గడించారు. వారిని తలచుకున్నప్పుడు మనలో భక్తిప్రపత్తి పెల్లుబుకుతుంది. వడలు పులకరిస్తుంది, మనసు జలదరిస్తుంది. కారణం ? వారిలోని ఉన్నతమైన వ్యక్తిత్వం, పవిత్రమైన శీలసంపద, అత్యున్నతమైన ప్రతిభ మరియు వారు ప్రదర్శించిన త్యాగమే దానికి మూలం.

అయితే నేటి పరిస్థితిని పరికిస్తే కొంత నిరుత్సాహమే కలుగుతుంది. నాటి స్త్రీకి వారసురాలైన నేటి స్త్రీ స్థానం ఈ సమాజంలో ఏమిటి ? వారి విలువ ఎంత ! వారికిస్తున్న గౌరవం ఎంతటిది ? ఏ రోజు పేపరు చూచినా కనిపిస్తాయి మానభంగాలు, వినిపిస్తాయి ఆర్తనాదాలు. ఆత్మహత్యల విషయం మామూలైంది. వరకట్నపు చావులకు అంతేలేదు. ఎక్కడ వున్నది ఈ లోపం ? కారణం ఏమిటి ? కారకులెవరు ? సనాతన భారతంలో స్త్రీలయెడల గల పవిత్రభావం, మాతృభావము లకు ఈనాడు తిలోదకాలిచ్చి, ఆడదంటే ఒక ఆటబొమ్మగా, భోగవస్తువుగా భావించేవారి సంఖ్య పెరిగిపోతుండటమే దీనికి ప్రధాన కారణం. ఈ స్థితి ఎప్పుడు మారుతుందో ? పరిస్థితులు ఎప్పుడు చక్కబడుతాయో ? ఒకటి మాత్రం వాస్తవం.

"ఏ దేశంలో స్త్రీ గౌరవించబడదో, ఆ దేశానికి భవిష్యత్తు లేదు" ఈ వాస్తవమును ప్రతి ఒక్కరూ గ్రహించాలి. ○

"Action without delay is the soul of efficiency"

ఆలసించక
ఆచరించుము
అదియె
నిష్ణా ము

జంగా గోపాల్

# తెలుగు పత్రికా ప్రపంచానికే "వరం" - సురవరం

తెలుగు పత్రికా రంగంలో సర్వదా సంస్మరణీయులైన సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు కొందరే వున్నారు. పువ్వాడ, కందుకూరి, సురవరం, గాడిచర్ల, ముట్నూరి, కోలవెన్ను, అడివి, తాపీ, నార్ల మున్నగువారు. ప్రస్తుతం ప్రముఖ పత్రికా సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డిగారి పత్రికా రచన గూర్చి పరిశీలిద్దాం.

## డాక్టరు వి. సిమ్మన్న

1926 మే 10 వ తేదీన ఉత్తమ పత్రికా సంపాదకులు ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో "గోలుకొండ" పత్రిక స్థాపించబడింది. ప్రారంభంలో ఈ పత్రిక ప్రతీ సోమవారం, బుధవారం వారానికి రెండు దఫాలు వెలువడుతుండేది. నిద్రాణమైవున్న నాటి తెలంగాణాను అన్నిరంగాల్లో మునుముందుకు నడిపించిన ఘనకీర్తి సురవరం వారికే దక్కుతుంది. తెలుగు ప్రజల్లో సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక రంగాల్లో చైతన్యం కలిగించిన ఉత్తమోత్తమమైన పత్రిక "గోలుకొండ". ముఖ్యంగా తెలంగాణాలోని జనాల్ని వెన్నుతట్టి మేలుకొల్పిన ప్రజా పత్రిక "గోలుకొండ" పత్రిక. సంఘ సంస్కరణాభివృద్ధికి ప్రజల ప్రగతికి, తెలుగు భాషాభివృద్ధికి మరియు తెలంగాణా ప్రజల్ని జాగృతం చేయడానికి కంకణం కట్టుకొని ఎనలేని సేవ చేశారు సురవరంవారు.

"గోలుకొండ" పత్రిక ఆశయాల్ని ఆదర్శాల్ని సిద్ధాంతాల్ని 1931 మే 9 వ తేది సంపాదకీయంలో ఇలా తెలియజేశారు. "మేము మా పత్రికా స్థాపన కాలంనుండి రెండు అంశాలు దృష్టిపథంలో వుంచుకొని దేశీయుల సేవచేయుచున్నాము. మొదటిది ఆంధ్ర భాషా సేవ. రెండవది జాతి, కుల వివక్షతలేక నిష్పక్షపాతంగా ఆంధ్రులలో సర్వ శాఖలవారియొక్క సత్వరాభివృద్ధికి పాటుపడుట" అని నొక్కి వక్కాణించారు. తాను నమ్మిన సిద్ధాంతాల్ని తు. చ. తప్పకుండ ఆచరించిన ఆదర్శ పత్రికా సంపాదకులు రెడ్డిగారు.

ఈ పత్రిక రెండు సంవత్సరాలు విజయవంతంగా నడిచిన తర్వాత సురవరంవారు న్యాయవాద వృత్తిని చేపట్టడం జరిగింది. అంచేత సంపాదకత్వ బాధ్యతను 1929-39 మధ్యకాలంలో కొండా బాలకృష్ణారెడ్డిగారు స్వీకరించారు. మరలా సురవరంవారు "గోలుకొండ" పత్రికా సంపాదకత్వాన్ని చేపట్టారు. ఇరువది సంవత్సరాల తర్వాత అనగా 1947 లో ద్వైవార పత్రికగా వెలువడుచున్న "గోలుకొండ" పత్రికను దినపత్రికగా మార్పుచేశారు.

కొంతకాలం తర్వాత పత్రికా యాజమాన్యం ప్రతాపరెడ్డిగారికి కొన్ని ఆంక్షలు విధించింది. ఆత్మాభిమానం గల రెడ్డిగారు యాజమాన్యానికి లొంగక సంపాదకత్వానికి తిలోదకాలిచ్చారు. ఆ పిమ్మట వరంగల్ జిల్లా మహబూబాబాద్‌కు చెందిన మాకల సర్వోత్తమరెడ్డిగారు 'గోలుకొండ' పత్రిక సంపాదకత్వం నిర్వహించారు. నలభై సంవత్సరాలు నిరంతర నిర్విరామంగా కొనసాగిన ఈ పత్రిక 1966 వ సంవత్సరంలో ఆగిపోయింది.

"గోలుకొండ పత్రిక ద్వారా ప్రతాపరెడ్డిగారు గావించిన కృషి చారిత్రాత్మకమైంది, అద్వితీయమైంది. గోలుకొండ పత్రిక ప్రజల్లో చైతన్యం కలిగించడంలో నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైంది. ఎవరికీ జంకక, ప్రభుత్వం ఒత్తిడికి లొంగక, తాము సత్యమని నమ్మినదానిని ప్రజల శ్రేయస్సుకొరకు ప్రకటించి

ప్రచారం చేయడంలో "గోలుకొండ" పత్రిక ఎన్నడూ వెనకాడలేదు. ఆనాటి సమస్త జాతీయోద్యమాలను గోలుకొండ పత్రిక బలపరిచింది. సంఘ సంస్కరణ ఉద్యమాలకు పెట్టని కోటగా నిలిచింది. ఈ పత్రిక ద్వారా ప్రతాపరెడ్డిగారు యువకులను అనేకమందిని ప్రోత్సహించారు ఆ రోజుల్లో తెలుగులో వ్రాయవలెనని ఉత్సాహం వున్న ప్రతి వారికీ గోలుకొండ పత్రిక ఆశ్రయమిచ్చింది. పత్రిక స్థాపించిన తొలి రోజుల్లో వివిధ విషయాలమీద వ్యాసాలు వ్రాసేవారు దొరకకపోయేవారు. అంచేత ప్రతాపరెడ్డిగారు వివిధ విషయాలమీద వేరు వేరు పేర్లతో వ్యాసాల్ని, కథానికల్ని వ్రాస్తూండేవారు ".



సురవారం వారు గోలుకొండ పత్రికలో వ్యాసాలు, చర్చలు, సమీక్షలు, లేఖలు మొదలైన వివిధ విషయాలపై వేరువేరు మారుపేర్లతో లెక్కలేనన్ని వ్యాసాలు వ్రాసి ముద్రించారు గద్వాల సిద్ధాంతి, వెర్రి వెంగళప్ప, చిత్రగుప్త, విశ్వామిత్ర, సంగ్రామసింహ, భావకవి రామమూర్తి, యుగపతి, హితదరి, బహదూర్, జంగం బసవయ్య, అమృతకలశి మున్నగు అనేక కలం పేర్లతో పెక్కు మంచి వ్యాసాలు వ్రాశారు.

వివాదాస్పదమైన ఏదో ఒక విషయాన్ని ఎన్నుకొని దానిపై వాదోపవాదాలు లేవదీసి రెండు వైపులా తానే వాడిగా వేడిగా ఆసక్తికరంగా ఉత్కంఠ భరితంగా ఉత్తమ వ్యాసాలు ఎన్నో వ్రాశారు హిందువులు శాకాహారులా ? శ్రీకృష్ణునికి మీసాలు వున్నాయా ! లేవా ? జంగంలు బ్రాహ్మణులా ? స్త్రీలకు స్వాతంత్ర్యం అవసరమా ? మున్నగు విషయాలపై సురవరంవారే స్వయంగా తీవ్ర వాదోపవాదాల్ని సమర్థవంతంగా నిర్వహించి పత్రికలపట్ల ప్రజలకు వల్లమాలిన అభిమానాన్ని ఆసక్తిని కలుగజేశారు.

1951 లో ప్రజావాణి అనే పేరుతో దినపత్రికను ప్రారంభించారు. ఇది కొంతకాలం వరకు నడిచి 1952 లో ఆగిపోయింది.

వీరు ఉత్తమమైన రచనలు చేసి ప్రతిభగల పత్రికా సంపాదకులుగా తెలుగు ప్రజల హృదయాల్లో చెరగని ముద్ర వేశారు. ఆంధ్రపత్రిక, తెలుగుతల్లి, మాతృసేవ, ప్రజాబంధు, ప్రబుద్ధాంధ్ర, కళ, సుజాత, శోభ, పినాకిని మొదలైన పత్రికల్లో వీరి వ్యాసాలు ముద్రించబడ్డాయి. వీరి వ్యాసాలతో ఆయా పత్రికలు ఎనలేని ప్రాముఖ్యత ను సంతరించుకున్నాయనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు.

పత్రికా నిర్వహణలో ఎన్ని కష్టాలు వచ్చినా ధైర్యంతో పట్టుదలతో గుండెనిబ్బరంతో ఎదుర్కొని తాను అనుకొన్న పని సాధించడం కోసం అహర్నిశలు కృషి చేసిన అసమాన్య సంపాదకులు వీరు. జాతీయ, ఆంధ్రోద్యమాలకు బహిరంగంగా మద్దతునిచ్చి, ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసి 'గోలుకొండ' పత్రికను నిరాఘాటంగా నడిపించి నిరుపమానమైన సేవ చేసిన ఉత్తమ పత్రికా సంపాదకులు సురవారంవారు.

# దాశ్య విముక్తి

కావిలిపాటి విజయలక్ష్మి

ఆ రాత్రి గరుడునకు కునుకు రాలేదు. అలసి నిద్రించు అమాయకురాలయిన తల్లి ముఖమును చూచినాడు.

తన తల్లి కద్రువకెందుకు దాస్యము చేయవలె ? ఆ నాగులు తనపై తన తల్లిపై ఎందుకు బుసకొట్టుదురు ? బాల గరుడునకీ కారణమేదో ఆ సమయముననే తల్లిని ప్రార్థించి గుట్టు తెలుసుకొన నెంచినాడు.

నాగులు నిద్రనొరిగినారు. భువి దివి అంతా నిశ్శబ్దము. జీవులు గాఢని నిద్రనొరిగినవేళ జననిని తట్టి లేపినాడు వైనతేయుడు.

నాగుల వలన తన తనయునకేమి చెరుపు జరిగినదో యని తలచి వినత కలవరమున గరుడుని శిరసు మూర్కొని తత్తరమున గొంతు వణక ఏమి నాయనా ? ఎందులకు పిలచితివి ? అడిగినది.

కద్రువకు ఆమె పుత్రులకు మనమెందుకు దాశ్యము చేయవలె ? నా తండ్రికామె సపత్ని నాగులు నా సోదరులు. సమాన భోగభాగ్యముల అనుభవించవలసినవారికి సేవ చేయుట ఎందులకు ? ప్రశ్నించినాడు.

ఆమె చిరునవ్వు నవ్వినది ప్రారబ్ధవశమున ఉత్తములు కూడ ఇడుములననుభవించక తప్పదు. అని తాను కద్రువ విహారమున కరుగుట నది ఒడ్డున తెల్ల గుఱ్ఱమును ఎంత తెల్లని గుఱ్ఱము ? అని తాను ముగ్ధ మనోహరయై పలుకుట, కద్రువ దాని వాలము నలుపనుట వివాదము తమ మధ్య పందెము చెప్పి ఓడిపోతిని తండ్రీ. అనినది వినత.

గరుడుని కనులెఱ్ఱవారినవి కుపితుడైనాడు. మోసమును మోసమున జయించవలెనని విభుదులందరు. ప్రయత్నించెదనని ధృడముగా భావించినాడు.

నాగుల నందరను సమావేశపరచినాడు గరుడుడు. మాకు మీ నుంచి దాశ్య విముక్తి కావలయునన్న మీకేమి కానుక కావలయునో కోరుకొనుడు ఇచ్చెద అనినాడు.

సంబరపడినారు నాగులు. నా కోర్కె తీర్పని మీరు నశించెదరుగాక. అని తల్లి ఇచ్చిన శాపమందరకు గుర్తు వచ్చినది. ఏక కంఠమున దేవలోకమునుండి అమృతము తెచ్చి మాకీయవలెననినారు.

తల పంకించి చిరునవ్వునవ్వినాడు. వీరెంత దురాశాపరులు ? వీరిచేత అమృతము త్రావించి లోకమున జీవుల కపకారము చేయువాడా ! తను ? కాదు ఉపాయమాలోచించెదనని మనమున యనుకొని నాగులతో అమృతము తెచ్చి ఇచ్చెదనని బాస చేసినాడు. అతడు శక్తిశాలి మహా బలవంతుడు దైవభక్తి పరాయణుడు. తలితండ్రులకు నమస్కరించి వారి ఆశీర్వాదము గైకొని అమరపురి కరిగినాడు.

అమృతభాండముదెచ్చు అతనిని అమరులడ్డగించినారు. వారికి వినయమున మ్రొక్కి తానీ భాండము దొంగిలుట తన అభిమతము కాదని అనుగ్రహింపుడని సురలు మరల అమృత భాండము చేకొను ఉపాయము చెప్పి, దివినుండి భువికేతెంచినాడు.

అమృతభాండము చూచిన నాగులు త్రావుటకు ఆతురత పడినారు.

ఆగుడు నదీస్నానమాచరించి శుచులై రావలె అని దర్భలపై అమృతభాండముంచి ఇక మా తల్లి దాస్య విముక్తి అయినట్లేనా ? అని ప్రశ్నించినాడు.

పరమానందభరితులైన నాగులు మీ తల్లి దాస్య విముక్తి అయినది అనినారు.

నాగులు నదీస్నానమునకు గరుడుడు తల్లి వద్దకు జనినవేళ దేవతలమృతభాండ మెత్తుకొనిపోయినారు.

విచారించిన నాగులు భాండముంచిన దర్భలు నాకుటచే వారి నాలుకలు చీలికలయినవి. ○

# కచోరము (The Round Zedoary)

ఇది చిన్న గుల్మజాతిలోని మొక్క. ఆకులు పసుపు చెట్టు ఆకులను పోలియుండును. కానీ దానికంటె వీని ఆకులు చిన్నవిగా నుండును. ఆకులు సువాసన కలిగి యుండును. కచోరములో దుంపయే ఔషధ ప్రాముఖ్యము కలిగియున్నది.




కచోరము దుంప కూడా మిక్కిలి సువాసన కలిగి యుండును. దుంపనే చిన్నచిన్నవిగ తరిగి ఎండించి అయుర్వేద మందుల షాపులలో అమ్ముదురు.

ఇది కారము, చిరు చేదు రుచుల మిశ్రమము. విపాకమున కూడ కారపు రుచి గలిగి యుండును. వేడిచేయు స్వభావము కలది. వాత కఫములను శమింపచేయును. దగ్గులను, వగర్పులను కట్టును; గుల్మముల హరించును, క్రిములను పోగొట్టును, సన్నిపాత జ్వరము, పార్శ్వ శూలలను హరించును, జలుబు - గొంతు నొప్పులకు - చాలా మంచిది.

కచోరములను మెత్తగా పొడిచేసి వస్త్రగాళితము చేయగా వచ్చిన చూర్ణమును తేనెతో కలిపి పుచ్చుకొనిన దగ్గులు ఉపశమించును. శ్లేష్మమును పోగొట్టును; ఇంతేగాక వీర్యవృద్ధి, వీర్య స్తంభనము కల్గించును. శగ రోగము గలవారు వాడిన నెమ్మదించును:

తామ్ర వంగముల రెంటిని కలిపి పచ్చి కచోరపు ముద్దలో గాని, దుంపలో గాని - పెట్టి శీలయిచ్చి పుటం వేసిన చక్కని భస్మమగును. దీనినే "వంగతామ్రము" అని అందురు, ఈ భస్మం ప్రబలమగు శ్వాసకాసలను తగ్గించి, శ్లేష్మమును దింపును; శుక్లనష్టము గలవారు వాడిన శుక్ల నష్టము కట్టును; దీని రసము కంఠస్వరమును బాగుచేయును;

కొబ్బరినూనె సీసాలో కొన్ని కచోరము ముక్కలు వేసి అలాగే వుంచుతున్న నూనె సువాసన గలిగి ఆహ్లాదముగా నుండును; మరియు వెంట్రుకలకు మేలు చేకూరును.

— ఎస్. ఎన్. దుర్గారావు

## మంజువాణి

కుండ గోలెమైన, కుంపటి పిడతైన
మట్టి మూకుడైన మన్ను ఒకటె
పేర్లు వేరయినను పెరుమాళ్ళు ఒక్కడే
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !

కష్టపడెడువాని కడగంట చూడక
బాధచెందువాని బాధ గనక
కొయ్యబొమ్మ గొల్వ కలుగునా మోక్షంబు?
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !

మాట వలన కల్గు మంచితనంబు,
మాట వలనె వచ్చు మత్సరంబు
మధురవాక్కుతోడ మానవతను పెంచి
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !

# శ ... దురాశ ... నిరాశ - 1

అన్నీ నాకూ ఉండాలనుకోవడం ఆశ.
అన్నీ నాకే ఉండాలనుకోవడం దురాశ.
అన్నీ నాకు లేవనుకోవడం నిరాశ.

ఆశ అన్నది ప్రతి మనిషికి వుంటుంది. ఉండాలి కూడ ! లేకపోతే ఈ లౌకిక ప్రపంచంలో మానవజాతి ఎప్పుడో అంతరించిపోయేది. ఆశలేని మనిషి లేడని చెప్పడం అతిశయోక్తి కాదు. కాని చాలమంది "మా కే ఆశలు లేవు." అంటూంటారు. అది వట్టిమాట ! –




అలాంటి వాళ్ళను నమ్మకండి ! – నిలువునా ముంచేస్తారు. మా ఊళ్ళోకి యీమధ్య ఓ స్వాములారు వచ్చారు. అయనగారు సన్యాసం స్వీకరించిన దగ్గర్నుంచీ ఉపన్యాసాలు చాలా జోరుగ చెప్తున్నారంటే వినాలన్న ఆశతో నేనూ వెళ్ళాను.

"నాయనలారా ? ఆశ అన్నది మహా చెడ్డది. అది మానవ జీవితాన్ని నరకప్రాయం చేసేస్తుంది. ఆశయే సకల దుఃఖములకు మూలము. అందుకని మనం ఆశల్ని చంపేసుకోవాలి ! – " అంటూ ఆయన గంభీరోపన్యాసం సాగించారు. ఉపన్యాసానంతరం అందరూ వెళ్ళిపోయారు. నేను మాత్రం ఒక్క క్షణం ఆగాను. ఆఖరన మిగిలిన నన్ను చూసి, అయన మందస్మితవదనంతో నన్ను పరికించి, కనుసైగతోనే నన్ను దగ్గరకు రమ్మన్నారు.

"ఏం నాయనా ? ఏదో సందేహంతో కొట్టుమిట్టాడుతున్నట్టున్నావు !" – అన్నారు నా మనసులోని భావాన్ని పసిగట్టినట్టు !

"అదే స్వామీ! .... అదే! .... ఇంతవరకు మీ ఉపన్యాసం విన్నాను.... చాల ఆనందంగా వుంది. కాని.... కాని...." అంటూ ఆగాను.

"ఆగావేం ? .... సందేహించకు నాయనా ! .... అడుగు...." అంటూ ప్రోత్సహించారు.

"అదే.... అదే.... తమకు ఏ ఆశలూ లేవా స్వామీ ?" అన్నాను భయం భయంగా.

"వెర్రివాడా ! .... ఇందుకా అంత మదనపడుతున్నావు ! .... మేమంతా ఆశల్ని అన్నిటినీ చంపేసుకొని ఇహలోక సౌఖ్యాల్ని కాలదన్నేశాము ! .... అయినా సర్వసంగపరిత్యాగులము !–మాకు ఆశలేమిటి నాయనా !– ఆ కైవల్య సాధనొక్కటే మా గమ్యం, లక్ష్యం ! – " అంటూ ధ్యానముద్రలో మునిగిపోయారు.

—అదిగో ! .... అక్కడే వుంది కిటుకు !

'మోక్షమొక్కటే కదా మేము కోరుకొనేది!' అన్న వారి మాటల్లోని భావమేమిటి ? అది మాత్రం ఆశ కాదా! అందుకనే యెంతటి యోగికైనా, భోగికైనా – ఆఖరుకు జోగికైనా ఆశ తప్పదు. అయితే ఈ ఆశ మనిషిని బట్టి, మనిషి స్థాయినిబట్టి మారుతుంది. బిచ్చగాడికైతే రోజుకో రెండు మూడు రూపాయలు ధర్మం దొరకాలని ఆశ ! అదే గుమాస్తా అయితే ఏ పార్టీయన్నా ఆ రోజు ఓ పాతికో పరకో యివ్వకపోతాడాని ఆశ ! .... ఇలా ఆశ మనిషి స్థాయిని బట్టి పెరుగుతుంది !

డబ్బంటే అందరికీ ఆశే కదండీ ! .... అందుకే లాటరీలో లక్షలు వచ్చిపడతాయంటే – ఆశతో అంతా ఎగబడతాం ! .... ఇది ప్రతి మనిషిలోనూ ఉన్న బల

హీనతే ! .... ఈ బలహీనతను exploit (ఎక్స్ప్లాయిట్) చేసికొనే తెలివితేటలుంటే ఎవరైనా ఈ రోజుల్లో లక్షలకు లక్షలు సంపాదించవచ్చును. అదే కొన్ని ప్రజా ప్రభుత్వాలు ప్రస్తుతం చేస్తున్న పని ! లాటరీల పేరుతో కాకుల్ని కొట్టి గద్దలకు వేసినట్లు - పేద ప్రజలు చెమటోడ్చి, రక్తం ధారపోసి సంపాదించిన రూపాయల్ని గుంజి, అందులో ఖర్చులు పేరిట కొంత కాజేసి, మిగిలిన దాన్ని ఎవరో కొంతమందికి పంచి యిస్తున్నారు. లాటరీ అంటే లైసెన్సుడు జూదం అని చెప్పవచ్చునేమో !

ఓ పువ్వు పేరుగాని, ఓ పండు పేరుగాని వ్రాసి కవర్లో పంపండి ! రాబోయే పన్నెండు నెలల్లో మీ భవిష్యత్తు రాసి పంపుతాం ! కేవలం పది రూపాయలకే ! ఇలాంటి ప్రకటనలు చూస్తూనే ఉన్నాం ! తన భవిష్యత్తు తెలిసికోవాలనే మనిషిలోని ఆశే దానికి ఆధారం !

అలాగే "చేతులు చూసి జాతకం చెప్తాం" అనే హస్త సాముద్రికులు ప్రతి పట్నంలోనూ రోడ్ల ప్రక్కల మనకు కనబడుతూనే ఉంటారు ! ఇలాగే చిలక జోస్యం కూడానూ ! ఇక రాజకీయ నాయకులకు తమ భవిష్యత్తుపై కొండంత ఆశను కలగచేసే జ్యోతిష్యుల సంగతి సరేసరి !

ఏదైనా పార్టీలో ముందు సభ్యుడిగా చేరితే కార్యకర్త అనిపించుకోవచ్చునని ఆశ .... కార్యకర్త అని అనిపించుకోగానే పార్టీలో ఏదైనా పదవి రాకపోతుందాని ఆశ ! ఓ పదవి రాగానే పార్టీ టిక్కెట్టు మీద ఎన్నికల్లో పోటీ చేయకపోతామాని మరో ఆశ ! పోటీ చేసి నెగ్గాక తన పార్టీకి మెజారిటీ వస్తే సరేసరి ! రాకపోతే అవకాశం చూసికొని ప్రభుత్వ పార్టీతో చేతులు కలపలేకపోతామా- చేతులు కలిపాక ఏ మంత్రి పదవినో సంపాదించలేకపోతామాని యింకో ఆశ ! ఇలా ఆశపైన ఆశ — బ్లాకు మనీతో కట్టిపారేస్తున్న అంతస్తుపై అంతస్తులా మనిషిక్కి ప్రతినిత్యం కిక్కిరుస్తూంటుంది ! అందుకే మనం " ఆశాలం ! "

# వింతలూ - విడ్డూరాలు

* జపాన్‌లోని ఇసావోత్సూ చియా ఒక గంట సేపట్లో 223 మంది అసాములకు గెడ్డాలు చేసి రికార్డు స్థాపించాడు. ఇది అంతకు పూర్వం గెరెల్డుహర్లె చేసిన రికార్డు కన్నా 20 మందికి ఎక్కువగా గెడ్డాలు చేసి ఇసావోత్సూ న్యూ రికార్డు సంపాదించాడు ! ఏదైనా రికార్డే కదా !
* సోవియట్ యూనియన్‌లో 10 మంది అంతకు మించి సంతానాన్ని కన్న స్త్రీకి 'వీరమాత' అన్న బిరుదును' 7-9 మధ్యని పిల్లలు ఉన్న తల్లులకు " ఆర్డర్ ఆఫ్ మదర్ హుడెగ్లోరీ " అనే బిరుదును ఇచ్చి సత్కరిస్తుంటారు.
* చెదపురుగులు 60 సంవత్సరాలు చెక్కుచెదర కుండా ఉండి. ఎంతో రమ్యమైన ఇళ్ళను నిర్మించుకుంటాయి. ఏ సిమెంటు వాడుతాయో మరి ! కదా !
* భాష రావడం ఒక ఎత్తు, అనువాదం చేయటం ఒక ఎత్తూ మహానుభావుడు ఒకాయన ఏకంగా 60 భాషల్లో అనువాదం చేయగలడు. యు. ఎన్. ఒ అనువాద విభాగంలోని ప్రాన్సుకు చెందిన ' గార్గన్‌స్కి-పాత్ ' అనే ఆయన ఈ పని చేస్తుంటాడట.
* ఒక చిన్న బియ్యపుగింజమీద 18 భగవద్గీత శ్లోకాలను చెక్కి అనన్య సామాన్యమైన చిత్ర కళను నిరూపించాడొక గుజరాతీ యువకుడు. ఇతడు పెంట్రుక మీద ' సత్యమేవ జయతే ' అన్న సూక్తిని కూడా చెక్కాడు. అమెరికా ప్రెసిడెంట్‌కు బియ్యంగింజమీద ఉత్తరం రాసి పంపాడు. ఇంతకి అతని పేరు " దోదెయా! "

# కపటులు - కుటిల రాజకీయాలు

"పితామహా ! లోకంలో మంచివాళ్ళతోపాటు కపటులైనవారు కూడా ఎంతోమంది ఉన్నారు. కపటులు తమ స్వార్థం కోసం ఎన్నో అబద్ధాలు చెపుతుంటారు. వారికి కావలసింది స్వార్థపూర్తి. తమ స్వార్థాన్ని కప్పిపుచ్చుకొని లోకోపకారం కోసం బయలుదేరామని చెప్పి వంచన చేస్తుంటారు. తీపిమాటలు చెప్పి ఎదుటివారిని మోసపుచ్చి తమ పబ్బం గడుపుకొంటారు. అట్టి వారి పద్ధతి ఎలా వుంటుందో, వారి బారినుండి జనులు ఎలా రక్షించుకోవాలో, రాజైనవాడు అలాంటివారిపట్ల ఎలా వ్యవహరించాలో వివరించవలసినదిగా ప్రార్థన." అని చెప్పి యుధిష్ఠిరుడు వినయంతో చేతులు జోడ్చి ఒదిగి నిల్చున్నాడు.

(ఎన్నికలలో అభ్యర్థులు ఓటర్లకు వాగ్దానాలు చేస్తుంటారు. ప్రజాసేవయే తమ లక్ష్యమని బల్లగుద్ది చెపుతుంటారు. కాని నిజంగా వారి కుండేది పదవీ వ్యామోహం-సేవాతత్పరత కాదు.)

భీష్ముడు ఇలా చెప్పాడు :-

ధర్మనందనా ! నీ ప్రశ్నకు సమాధానంగా ఒక కథ చెపుతాను విను. పూర్వం విదిశా పట్టణంలో ఒక యింట్లో ఒక బాలుడు చనిపోయాడు. బంధువులు దుఃఖించారు. బాలుని శవాన్ని ప్రేతభూమికి తీసుకెళ్ళారు. అక్కడ బాలుని శవాన్ని ఉంచి దుఃఖమాగక యింకా ఏడుస్తూ కూర్చున్నారు. అక్కడికి ఒక గ్రద్ద వచ్చింది. దానికి ఆకలిగావుంది. శవాన్ని పీక్కొని తిందామంటే వీళ్ళందరు చుట్టూఉన్నారు. వాళ్ళతో గ్రద్ద యిలా అంది.

"అయ్యా! మీరంతా యింకా యిక్కడే కూర్చొని దుఃఖిస్తున్నారు. ఇదిగో ప్రొద్దుగ్రుంకుతున్నది. భూత, ప్రేత పిశాచాలు చీకటి పడగానే ఇటుగావస్తాయి. అవి వచ్చాయంటే మీ పనికూడ ఖాళీ అవుతుంది. పోయిన వాడు ఎలాగూపోయాడు. వాడితోపాటు మీరు కూడా పోతారా ? మీ మంచి కోసం చెబుతున్నాను. పీనుగను అవతల పారేసి త్వరగా తెమిలి ఇక్కడనుండి వెళ్ళండి పోయినవాడు తిరిగిరాడుకదా ! ఎందుకు వెర్రి-" అచ్చం ఎలక్షన్ సమయంలో అభ్యర్థిలా ఫోజు పెట్టి చెప్పింది గ్రద్ద.

గ్రద్దమాటలు విని అందరూ భయంతో లేచి శవాన్ని విడిచిపోవటానికి సిద్ధపడ్డారు. ఇంతలో ప్రక్కనేవున్న బొక్కలోనుండి ఒక నక్క గభాలున ముందుకువచ్చి మరొక రాజకీయనాయకుడిలా నిల్చొని యిలా అన్నది.

"అయ్యయ్యో ! గ్రద్ద మాటలకు భయపడి పోతున్నారా ? చనిపోయిన ఆ బాలుని ముఖం చూడండి. ఎంత ముద్దొస్తుందో ! విడిచి వెళ్ళటానికి మీకు కాళ్ళు ఎలా వస్తున్నాయి ? ఏడవండి యింకాసేపు ఏడవండి. పొంగివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగడం ఎందుకు ? అలా ఏడుస్తుంటే దేవుడు దయతలచి పిల్లవానిని బ్రతికిస్తాడేమో! ఇంకా ప్రొద్దు బారెడున్నది ఎందుకు తొందర" అన్నది.

నక్క మనస్సులో చీకటిపడిన తరువాత బంధువులు వెళ్ళాలనివుంది. అప్పుడైతే దానికి సుఖం. గ్రద్దకు వెలుగు కావాలి నక్కకు చీకటి కావాలి. ఇరువురికి శవాన్ని పీక్కొని తినటమే లక్ష్యం.

నక్క మాటలు విని బంధువులకు ఆశ పుట్టి అక్కడే ఆగిపోయారు. అప్పుడు మళ్ళీ గ్రద్ద వచ్చింది.

"ఈ నక్క ఒట్టి మందబుద్ధి దీని మాటలు వినకండి. శవాన్ని చూశారా ! ఎంత వికృతంగా తయారైందో ? యింకా బ్రతకటమెక్కడ ? ఆశలు పెట్టుకోవద్దు. ఇంటికి వెళ్ళండి. బాలునికి మంచి లోకాలు లభించేందుకు దానధర్మాలు చేయండి ! పొండి " అని చెప్పింది.

గ్రద్ద మాటలకు ఆక్షేపించిన నక్క మళ్ళీ వారితో యిలా చెప్పింది. "గ్రద్ద హృదయం ఎంతో కఠిన మైనది – మీరు పోకండి. కన్నీళ్లు నాకే ఆగటం లేదు. మీకు ఎట్లా ఆగుతాయి ? కనుక ఆగండి. పిల్లవానిపై దయ చూపించండి. యింకాసేపు దుఃఖించండి "

అప్పుడు గ్రద్ద యిలా అంది. "నేను పుట్టి వేయి సంవత్సరాలు అయింది. చచ్చిపోయినవాడు ఎన్నడూ తిరిగి రావటం చూడలేదు. ఈ నక్క మాటలకు మోస పోవద్దు, వెళ్ళండి "

ఈ మాటలకు మళ్ళీ లేచి వెళ్ళిపోతున్న బంధువుల కాళ్ళకు అడ్డుపడి నక్క "అయ్యయ్యో మీరు అలా వెళ్ళిపోతారేమిటి ? ఏ క్షణంలో ఏ దేవుడు అడ్డుపడి మేలు చేస్తాడో తెలియదు. కనుక ఉండండి, ఏడవండి " అని ఉపన్యాసం చెప్పింది.

బంధువులు మళ్ళీ వచ్చి శిశువు శవం చుట్టూ చేరి ఏడుస్తూ కూర్చున్నారు

అంతలో పొద్దుగూకింది. చీకటి పడింది. చీకటి పడటంతోటే గ్రద్ద జంబుకాలు అకస్మాత్తుగా ప్లేటు ఫిరాయించాయి, గ్రద్ద వారితో పోవద్దు ఉండమంటుంది– నక్క ఉండవద్దు వెళ్ళమంటుంది. ఇందాక చెప్పిన మాటలకు సరిగ్గా విరుద్ధమైన మాటలు చెప్పసాగాయి అన్నమాట.

ఒక వైపు గ్రద్ద, మరొక వైపున నక్క చేరి ఈ రకంగా ఉపన్యాసాలు దంచుతున్నాయి. స్వవచోవ్యాఘాతాలు చేసుకొంటున్నాయి. రెంటికి ఉన్న సమస్య తమ తమ ఆకలిని తీర్చుకోవటం – తమ లక్ష్యాన్ని నెరవేర్చుకోవటం. అందుకని ఆ శవాన్ని ఆహారంగా సంపాదించాలి. కాని తమ లక్ష్యాన్ని కప్పిపుచ్చి బాలుని పట్ల, బంధువుల పట్ల, అంతులేని సానుభూతిని ప్రకటించి కడవల కొద్ది మొసలి కన్నీటిని కారుస్తున్నాయి – గ్రద్ద జంబుకాలు రెండు.

ధర్మనందనా ! నీ వడిగిన ప్రశ్నకు సమాధానం ఈ కథలోనే వుంది – ఆలోచించి చూడు కపటుల మాటలకు మోసపోక ప్రజలు లేక రాజు తమ తమ స్వయం నిర్ణయంతో పనులు చేయవలసి ఉంటుంది. లేకపోతే మోసం తప్పదు.

( ఓటరు మహాశయులకు కనువిప్పు కలిగించే ఉపాఖ్యానం కాదూ ఇది ! )

(భీష్మ యుధిష్ఠర సంవాదము నుండి)

సాయి చెప్పిన కథలు :

# అతి తెలివి

మన ప్రాచీన విధానములో విద్యా సంప్రదాయాను సారియగు నొక తండ్రికి నవీన విద్యా నాగరికతలో పెరిగి అతి ప్రతిభావంతుడనని విర్రవీగు ఒక కుమారు డుండెను. ఒకనాడు భోజన సమయమున తండ్రి రెండు లడ్లు తెచ్చి ఒకటి తన కంచమున ఇంకొకటి కుమారుని కంచమున నుంచి "రెండు లడ్లున్నవి, చెరి యొకటి తిందాము" అని తండ్రి పల్కెను .

"నాన్నా నీకింతమాత్రము కూడా తెలియదా! ఇచ్చట మూడు లడ్లు ఉండగా రెండే ఉన్నాయనుచున్నావేమిటి?" అని అతితెలివిగా ప్రశ్నించాడు కొడుకు.

" ఏవిరా! ఇచ్చట మూడు లడ్లు ?" అని ఆశ్చర్యంగా చూసాడు. "ఇదిగో చూపెదను చూడు. లెక్క జాగ్రత్తగా పెట్టి చూచి చెప్పుము నాన్నా ! నీ కంచములో ఒకటి" అది తీసి తన కంచములో పెట్టుకొని, "ఇదిగో నా కంచములో రెండున్నవా ? ఈ రెండు ఇందాక నీ కంచములోని ఒకటి చేరి మూడు కావా? ఈ మాత్రము లెక్కలుకూడా రావే నాన్నా ! ఇంతేనా–" అన్నాడు హేళనగా ఆ కొడుకు. "ఔనురా నాయనా! పాతకాలపు వాడను. నీవలె ఇంగ్లీషు గింగ్లీషు నేను చదివితినా ? నీయంతటి తెలివి నాకెట్లుండునులే!" అనుచు "అది పోనీ గానీ నీవు చెప్పిన మూడు లడ్లలో పెద్దవాడనుగాన ఈ రెండు నేను తిందును. ఆ మూడవది నీవు తినుము" అని ఉన్న ఆ రెండు లడ్లు తండ్రి తినెను.

ఆ అతి మేధావంతుడు రెండు గుడ్లు మిణుకరించి చూచుచు ఊరకయుండెను.

* అతి తెలివికి ఫలితమేమి ?

(శ్రీ సత్యసాయి కథాసుధ నుండి)

శ్రీ గురూజీ చెప్పిన కథలు :

# నిర్మాణాత్మకమైన పనులు ఉద్రేకంవల్ల కావు

**ఆందోళనలు, సమ్మెలు, ఉద్రేకపూరిత** ప్రసంగాలు నేడు మనం సాధారణంగా చూసే కార్యక్రమాలు. కాని ఇటువంటివి క్షణికమైనవి. అంతేకాక ఉద్రేకంలో వున్నవారి మనస్సులు అదుపులో వుండవు. అందువల్ల వాటినుంచి ఎటువంటి శాశ్వత ఫలితాలు రావు.

ఈ సందర్భంలో షేక్స్పియర్ నాటకంలోని ఒక సన్నివేశం గుర్తుకు వస్తుంది. జూలియస్ సీజర్‌ను హత్యచేశారు అతని శత్రువులు. సీజర్‌ను చూడటానికి వచ్చిన జనసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ " సీజర్ గొప్ప వ్యక్తి అనడంలో సందేహంలేదు. కాని ఆయన ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేశాడు. తాను నియంత కావాలని కలలు కన్నాడు. మేము ఒక ప్రజాద్రోహిని అంతం చేసాము " అంటూ వివరించారు. ఈ మాటలు అక్కడి జనసమూహానికి బాగా నచ్చాయి. వారందరికీ సీజర్‌పైన కోపం వచ్చింది.

కొంతసేపైన తరువాత సీజర్ స్నేహితులలో ఒకడు అక్కడ వున్న ప్రజాసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగించడం మొదలుపెట్టాడు. "సీజర్‌ను చంపడానికి గల అనేక కారణాలను గురించి మీరు తెలుసుకున్నారు. అవన్నీ సరైనవే. కాని సీజర్ మీ అందరికీ అనేక విధాలుగా మేలుచేసి యున్నాడు. కాబట్టి సీజర్‌యొక్క వాస్తవ రూపాన్ని మీ ముందుంచడానికి నన్ను అనుమతించవలసింది " అని ప్రార్థించాడు అక్కడి శ్రోతలు ఆయనను మాట్లాడవలసిందిగా కోరారు. ఆయన తన సంభాషణాచాతుర్యంతో సీజర్ హంతకుల పట్ల జనసామాన్య క్రోధాగ్నిని ప్రజ్వరిల్లచేశాడు. జనులు మహోద్రేకంతో నినాదాలు చేస్తూ సీజర్ హంతకుల ఇళ్ళపైపడి ధ్వంసంచేసి వారిని చంపివేశారు.

జనసమూహాన్ని ఉత్తేజితులనుచేసి వారిని ఒక పని దిశలో కార్యోన్ముఖులను చేసిన తరువాత నాయకులకు వారిపై ఎటువంటి అదుపు వుండదు. సంఘటన వేతు అనుశాసనము, ఓర్పు మొదలైన సంస్కారాలు సంఘ శాఖలో మనకు లభిస్తున్నాయి. అందువల్ల ఆలోచనలను అదుపుచేయడం, బుద్ధిని సమాజహితకార్యంలో లగ్నం చేయడం సాధ్యమవుతున్నది.

( కథా కల్పతరువునుండి )

## వానల్లో నేను ...?

అహంకారంతో హుంకరించే
అవినీతి సముద్రాన్ని
నదుల సంకెళ్ళతో
గిరులకు బంధించివేస్తా !
దివి నుంచి భువికి
తెల్లని దారాలు కట్టి
శాంతిపతాకాన్ని నేస్తా
అవసరమైతే దానికి
భగత్ సింగ్ భావాల్లోని
ఎరుపును పూస్తా!
కొండవాగులలో కలసివచ్చే
గిరిజనుడి ఎర్రటి కన్నీటిని
వేరు చేసి
యువశక్తుల హృదయాలలోకి
ప్రవహింపచేస్తా
భూస్థాపితమైపోతున్న
ఆశయాల విత్తులను
మొలకెత్తింప చేస్తా !

— ఖడబాగ్ని శంకరరాజు

# • విజ్ఞానవాణి •

## ష్టించిన రావూరు

### సలీం ఆలీ

1896 నవంబరు 12 న జన్మించాడు సలీం ఆలీ. పక్షులు వాటి జీవితాలు మీద పరిశోధన చేసిన తొలి భారతీయ పరిశోధకుడు. 'వైల్డ్ లైఫ్ కన్సర్వేషన్ బహుమతిని పొందిన సలీం అలీ 'బుక్ అఫ్ ఇండియ బర్డ్స్' అనే పుస్తకంలో తన పరిశోధనలు పొందుపరిచాడు. పేదరికం వలన అతని పరిశోధనలు తొ దశలో నెమ్మదిగా సాగినా, రానురాను అతని పరిశోధనలపై అభిమానమున్నవారు, అరుదైన పక్షులను అతడు సేకరిస్తున్న విధానాన్ని చూసినవారు తగు అర్ధిక సహాయం చేసేవారు. నిజానికి సలీంకు ఏ యూనివర్శిటీ డిగ్రీ కూడా లేదు. కాని అతని పరిశోధనలు జూయాలజీ అభ్యసిస్తున్న విద్యార్థులెందరికో ఉపయోగపడింది. 1948 లో ఎస్. డిల్లన్ రిప్లెతో కలిసి అంతర్జాతీయంగ అతని పరిశోధనలు కొనసాగించాడు.

### పి. మహేశ్వరి

మొగ్గ, పువ్వు, మొక్కలపై మహేశ్వరి పరిశోధనలను డాడ్జియన్ అనే అమెరికా శాస్త్రజ్ఞునితో కలిసి చేశాడు. 1904 నవంబరు 9 న రాజస్థాన్‌లో జైపూర్‌లో జన్మించాడు. వృక్షాలపై పరిశోధనలు చేసి అతి తేలికగా అర్థమయ్యే రీతిలో వృక్ష శాస్త్రాన్ని రచించాడు. 1951లో 'ఇంటర్నేషనల్ సొసైటీ అఫ్ ప్లాంట్ మార్ఫాలిజిస్టు'ను స్థాపించాడు 1966 మే 18 న అతడు మరణించే వరకు ఫైటొ మార్ఫాలజీ అనే సైన్సు పత్రికకు సంపాదకుడుగా పని చేశాడు.

### బి. పి. పాల్

చిన్నప్పటినుంచే కూరగాయల మొక్కలను పెంచడంపై శ్రద్ధ వహించిన పాల్ 1906 మే 26 న పంజాబ్‌కు చెందిన ముకుందాపూర్‌లో జన్మించాడు 1929 లో గోధుమ పంటపై అతడు చేసిన పరిశోధనలకు కేంబ్రిడ్జి యూనివర్శిటీ పి. హెచ్. డి యిచ్చి సత్క-

ఎవరో బందరులో చాలామందికి తెలుసు - ఆయన పేరు అద్దేపల్లి శ్రీశైల మల్లికార్జునరావుగారు. కృష్ణా పత్రికలో గుమాస్తాగా వుంటూవుండేవారు. మంచి హాస్య ప్రియుడు - సంభాషణాచతురుడు. ప్రతి మాటలోను, ప్రతి వ్యాఖ్యలోనూ హాస్యం తొణికిసలాడుతూ వుండేది. ప్రవృత్తులు ఒకటి అవడంవలన కావచ్చు ఇద్దరూ సన్నిహిత మిత్రులయ్యారు. తన సన్నిహిత

## రంచి వాసుదేవరావు

మిత్రుడైన మల్లికార్జునరావును మల్లినాధసూరి అని పేరు పెట్టి వారం వారం హాస్యపు జల్లులను కురిపించేవారు. ద్వితీయప్రపంచ సంగ్రామ కాలంలో అయన సృష్టించిన లండన్‌శాస్త్రి నామధేయం దేవరకొండ నరసింహశాస్త్రి -

ఆరోజులలో కృష్ణాపత్రిక పాఠకులు ప్రతి వారం వడగళ్ళ చదివి హాయిగా కాసేపు నవ్వుకునేవారు. వీటిని చదివి గంభీర స్వభావుడైన ముట్నూరివారు కూడి ముసిముసిగా నవ్వుకునేవారని ప్రతీతి. జంధ్యాల పాపయ్యశాస్త్రి? రుక్మిణీనాధశాస్త్రిగారి మాదిరిగానే రావూరువారుకూడ పారడీల ప్రయోగంచేస్తూ వుండేవారు. భాగవతంలోని పోతన విరచిత "పలికెడిది భాగవతమట" - అనే ప్రసిద్ధ పద్యానికి రావూరు వారి పారడీ.

కరిపెడిది ఆవకాయట
కలిపించువాడు మేనమామట
తా కలిపిన వాత హారముగునట
కలిపెద పీ రొండవాయి కలుపగ నేలా !

రావూరు వారు కృష్ణా పత్రికలో వుండగా ఉప్పులూరి కాళిదాసుగారు సంపాదకత్వం వహించిన ప్రసిద్ధ వార

శ్రీ గురూజీ చెప్పిన కథలు :

# నిర్మాణాత్మకమైన ప

ఆందోళనలు, సమ్మెలు, ఉద్రేకపూరిత ప్రసంగాలు నేడు మనం సాధారణంగా చూసే కార్యక్రమాలు. కాని ఇటువంటివి క్షణికమైనవి. అంతేకాక ఉద్రేకంలో వున్నవారి మనస్సులు అదుపులో వుండవు. అందువల్ల వాటినుంచి ఎటువంటి శాశ్వత ఫలితాలు రావు.

ఈ సందర్భంలో షేక్స్పియర్ నాటకంలోని ఒక సన్నివేశం గుర్తుకు వస్తుంది. జూలియస్ సీజర్‌ను హత్యచేశారు అతని శత్రువులు. సీజర్‌ను చూడటానికి వచ్చిన జనసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ " సీజర్ గొప్ప వ్యక్తి అనడంలో సందేహంలేదు. కాని ఆయన ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేశాడు. తాను నియంత కావాలని కలలు కన్నాడు. మేము ఒక ప్రజాద్రోహిని అంతం చేసాము. " అంటూ వివరించారు. ఈ మాటలు అక్కడి జనసమూహానికి బాగా నచ్చాయి. వారందరికీ సీజర్ పైన కోపం వచ్చింది.

కొంతసేపైన తరువాత సీజర్ స్నేహితులలో ఒకడు అక్కడ వున్న ప్రజాసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగించడం మొదలుపెట్టాడు. "సీజర్‌ను చంపడానికి గల అనేక కారణాలను గురించి మీరు తెలుసుకున్నారు. అవన్నీ సరైనవే. కాని సీజర్ మీ అందరికీ అనేక విధాలుగా మేలుచేసి యున్నాడు. కాబట్టి సీజర్‌యొక్క వాస్తవ రూపాన్ని మీ ముందుంచడానికి నన్ను అనుమతించవలసింది " అని ప్రార్థించాడు. అక్కడి శ్రోతలు ఆయనను మాట్లాడవలసిందిగా కోరారు. ఆయన తన సంభాషణాచాతుర్యంతో సీజర్ హంతకుల పట్ల జనసామాన్య క్రోధాగ్నిని ప్రజ్వరిల్లచేశాడు. జనులు మహోద్రేకంతో నినాదాలు చేస్తూ సీజర్ హంతకుల ఇళ్ళపైపడి ధ్వంసంచేసి వారిని చంపివేశారు. జనసమూహాన్ని ఉత్తేజితులనుచేసి వారిని ఒక పని కతో కార్యోన్ముఖులను చేసిన తరువాత నాయకులకు

తరహాల అన్యాయాలపై ఏకకాలంలో జరిగే పోరాటానికి రూపకల్పన అని చెప్పవచ్చు.

1. స్త్రీ, పురుషుల మధ్య సమానత్వానికి పోరాటం
2. చర్మపురంగు ఆధారంగా జరిగే విచక్షణలపై పోరాటం
3. కులాన్ని వ్యతిరేకిస్తూ, వెనుకబడిన వారికి ప్రత్యేక సౌకర్యాలకై పోరాటం
4. విదేశపాలన అంతంచేసి, ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపనకై పోరాటం
5. ఆర్థిక సమానత్వంకోసం, వికేంద్రీకరణకోసం, ప్రణాళికాబద్ధమైన పెరుగుదలకోసం పోరాటం
6. పౌరుల వ్యక్తిగత జీవితాలలో ప్రభుత్వ జోక్యానికి వ్యతిరేకంగా పోరాటం
7. సాంప్రదాయక ఆయుధాలు, అణు ఆయుధాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహానికి గుర్తింపు తీసుకురావటానికి పోరాటం

ఈ ఏడు విప్లవాలు విజయవంతమైతే మానవజాతి అంతటిలో అంతరంగిక శాంతి, భౌతిక సిరిసంపదలు, వెల్లివిరిసే ఒక మహోజ్వల నూతన శకం ఆవిర్భవిస్తుందని లోహియా నిండుమనసుతో భావించాడు.

ఒక్క మాటలో లోహియా నూటికి నూరుపాళ్ళు ప్రజల మనిషి. దేశభక్తులలో సాటిలేని నాయకమణి. ప్రముఖ అంతర్జాతీయవాది. ప్రజాస్వామిక పోషలిస్టు సిద్ధాంత నిరాడంబర జీవన సరళిలో గాంధీజీ తరువాత ఎన్నదగిన వ్యక్తి, గాంధీజీ మన్ననలను పొందిన నిష్కపటి పలుకు వేడిగా, వాడిగా ఉన్నా, మనస్సు వెన్నలా మెత్తనిది. పేదల ఎడ మమతాభావనతో, మాతృభూమి, మానవాళి పట్ల ప్రేమార్ద్రతలతో స్వార్థ మెరుగని సేవానిరతితో, జీవితాంతం వరకు. అన్యాయాలతో రాజీపడని పోరాటాన్నిసాగించిన యోధానుయోధుడు. నేటి యువతరానికి ఆయన జీవితం ఎంతో వెలుగును, స్ఫూర్తిని ఇస్తుందనటంలో సందేహం లేదు.

# 'వడగళ్లు'తో చరిత్ర సృష్టించిన రావూరు

**కృష్ణా పత్రిక** అనగానే ముట్నూరి కృష్ణారావు గారితోపాటు చాలామంది వ్యక్తులు - ఆ పత్రికతో సన్నిహిత సంబంధం గలవారెందరో గుర్తుకు వస్తారు. వారిలో చెప్పుకోదగ్గవారు రావూరు వెంకటసత్యనారాయణ రావు గారు 1930 దశకంలో ముట్నూరి కృష్ణారావుగారు జైలునుంచి విడుదలయ్యాక పత్రిక ఉపసంపాదకులుగా చేరినవారిలో. కమలాకర వెంకటరావుగారు, రావూరు వెంకటసత్యనారాయణరావుగారు ప్రముఖులు - వీరిద్దరు కృష్ణారావుగారి రెండు భిన్న వ్యక్తిత్వాలకు వారసులు -

కృష్ణారావుగారి గంభీర వ్యక్తిత్వానికి తత్వచింతనకు ఆలోచనాసరళికి వెంకట్రావుగారు వారసులుకాగా, వారిలో అంతర్లీనంగా వున్న హాస్య ప్రియత్వానికి, చమత్కారానికి రావూరువారు వారసులు. ఆరోజులలో కృష్ణారావు సంపాదకీయాలు, లో వె లు గు లు, మొదలైనవాటికి ఆకర్షితులయ్యే సీరియస్ రీడర్సు కొందరయితే హాస్యం చమత్కారం ఉట్టిపడే విధంగా రావూరు వారు వారం వారం రాసే వడగళ్ళ కోసం ఎదురుచూచే పాఠకులు మరికెందరో వుండేవారు.

దాసు వామనరావుగారి కాలక్షేపం, న్యాయపతి నారాయణమూర్తిగారి 'ప్యాసుపోరీ' శీర్షికలకు ఏ విధంగానూ తీసిపోని విధంగా "వడగళ్లు" శీర్షికను రావూరువారు నిర్వహించేవారు - వర్తమాన సమాజ పరిస్థితులు, సమకాలీన సంఘటనలపై చురకల్నీ వడగళ్ల రూపంలో రావూరు వారు వదలుతు వుండేవారు. గురజాడ అప్పారావుగారు గిరీశం పాత్ర సృష్టించడానికి, పానుగంటివారు జంఘాలశాస్త్రి సృష్టించడానికి ప్రేరకులు ఎవరో మనకయితే స్పష్టంగా తెలియదుకాని, రావూరు వారి మల్లినాధసూరి పాత్ర సృష్టికి ప్రేరకులు ఎవరో బందరులో చాలామందికి తెలుసు - ఆయన పేరు అద్దేపల్లి శ్రీశైల మల్లికార్జునరావుగారు. కృష్ణా పత్రికలో గుమాస్తాగా వుంటూవుండేవారు. మంచి హాస్య ప్రియుడు - సంభాషణాచతురుడు. ప్రతి మాటలోను, ప్రతి వాక్యంలోనూ హాస్యం తొణికిసలాడుతూ వుండేది. ప్రవృత్తులు ఒకటి అవడంవలన కావచ్చు ఇద్దరూ సన్నిహిత మిత్రులయ్యారు. తన సన్నిహిత

**కంచి వాసుదేవరావు**

మిత్రుడైన మల్లికార్జునరావును మల్లినాధసూరి అని పేరు పెట్టి వారం వారం హాస్యపు జల్లులను కురిపించేవారు. ద్వితీయప్రపంచ సంగ్రామ కాలంలో ఆయన సృష్టించిన లండన్‌శాస్త్రి నామధేయం దేవరకొండ నరసింహశాస్త్రి -

ఆరోజులలో కృష్ణాపత్రిక పాఠకులు ప్రతి వారం వడగళ్ల చదివి హాయిగా కాసేపు నవ్వుకునేవారు. వీటిని చదివి గంభీర స్వభావుడైన ముట్నూరివారు కూడ ముసి ముసిగా నవ్వుకునేవారని ప్రతీతి. జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి మాదిరిగానే రావూరువారుకూడ పారడీల ప్రయోగంచేస్తూ వుండేవారు. భాగవతంలోని పోతన విరచిత "పలికెడిది భాగవతమట" - అనే ప్రసిద్ధ పద్యానికి రావూరు వారి పారడీ.

కరిపెడిది ఆవకాయట
కలిపించువాడు మేనమామట
తా కలిపిన వాత హారమగునట
కలిపెద వీ రొండువాయి కలుపగనేలా !

రావూరు వారు కృష్ణా పత్రికలో వుండగా ఉప్పులూరి కాళిదాసుగారు సంపాదకత్వం వహించిన ప్రసిద్ధ వార

పత్రిక 'ఆనంద వాణి'లో 'కప్పు కాఫీ' పేరుతో వడగళ్ళు ఫక్కీలోనే హాస్యశీర్షికను కొంతకాలం నిర్వహించారు.

1952 లో కృష్ణాపత్రిక యాజమాన్యంలో మార్పు వచ్చింది. ఆ కొత్త పరిస్థితులలో ఏకారణం వల్లనో రావూరు వారు ఇమడలేకపోయారు. అప్పటికే వడగళ్ళ శీర్షిక ద్వారానేకాని నెలవంక వంటి తన నవలలు నాటకాలద్వారా, ఆంధ్రనాటక కళాపరిషత్‌తో ఆయనకు గల సన్నిహిత సంబంధాలద్వారా మద్రాస్ సినిమా పరిశ్రమ దృష్టిని అకర్షించారు. హాస్య ప్రియత్వంగల భానుమతి తను తీయబోయే సంపూర్ణ హాస్య రస చిత్రం 'చక్రపాణి'కి కథను సంభాషణలను సమకూర్చే బాధ్యతను రావూరు వారికి అప్పగించింది.

బహుశ చక్రపాణి తెలుగులో తీయబడిన మొట్ట మొదటి సంపూర్ణ సభ్య హాస్య చిత్రం చక్రపాణి. ఇందులో రావూరు వారి ప్రతి సంభాషణ హాస్యరస గుళిక. ప్రతిసన్నివేశమూ హాస్యస్ఫోరకం. పరమ లుబ్ధాగ్రేసర చక్రవర్తి తాతయ్యగా సి ఎస్ ఆర్, గడుసు మనుమరాలుగా భానుమతి, గుమాస్తాగా వంగర వెంకటసుబ్బయ్య – మనోరమ అక్కయ్యగా సూర్యకాంతం, ఆమె భర్తగా శివరామకృష్ణయ్య, నాయకుడుగా అక్కినేని నాగేశ్వరరావు పోటాపోటీలు పడి హాస్యాన్ని చిందించారు. ఆ తర్వాత భానుమతి నిర్మించిన "వరుడు కావాలి" అనే చిత్రానికి ఆయన సంభాషణలు సమకూర్చారుకాని, అది చక్రపాణి అంత విజయవంతం కాలేదు ఆ తర్వాత ఆయన ఒకటి రెండు చిత్రాలకు సంభాషణలు సమకూర్చి చిత్ర పరిశ్రమలో నిలదొక్కుకోలేకపోయాడు.

తర్వాత 1960 లో ఆయన ఆంధ్రప్రభ దినపత్రికలో ఉపసంపాదకుడిగా చేరారు. ఆయన అప్పుడు ఆ పత్రికలో "ఆషామాషి" రాస్తూ వుండేవారు. అది వడగళ్లకు మరో రూపం. "వడగళ్ళు" చదవనివారిని ఆషామాషీ ఆకర్షించినా అది వడగళ్ళు స్థాయిని చేరుకోలేదని, రెండు శీర్షికలను చదివినవారు భావిస్తారు.

ముట్నూరి కృష్ణారావుగారి హాస్య చతురతను రావూరు వారు గ్రంథస్తం చేశారు అంతేకాక ఆయన జీవితచరిత్రను క్లుప్తంగా గ్రంథస్తం చేశారు. రావూరు వారి సమక్షంలో గంటలు నిముషాలుగా గడచిపోయేవి. సంభాషణాక్రమంలో అనేక విషయాలు దొర్లిపోతూ వుండేవి.

వడగళ్ళకి పూర్వమూ, ఆ తర్వాత అనేకమంది హాస్య శీర్షికలను నిర్వహించాలని ప్రయత్నించారు. రావూరి వారి పరోక్ష ప్రభావంతో ఈ రచయిత కూడ కృష్ణా పత్రికలో "గిలిగింతలు" అనే శీర్షికనూ వడగళ్ళ పద్ధతిలో నిర్వహించారు. మల్లినాధసూరి వారసునిగా జ్ఞానీంద్రను సృష్టించారు. జ్ఞానీంద్రకు కూడా ప్రేరణ మల్లినాధసూరే. గిలిగింతలు "వడగళ్ళ"ను స్ఫురింపజేసిందే తప్ప, ఆ స్థాయిని చేరుకోలేదు గిలిగింతలే కాదు, ఆ ధోరణిలో వచ్చిన అనేక శీర్షికలు వడగళ్ళ స్థాయిని చేరుకోలేదు.

"హాస్య కాలమిస్ట్" గా రావూరు వారు సాధించిన విజయాలను ఇంతవరకు మరే రచయిత సాధించలేదన్న నా అభిప్రాయంతో చాలామంది ఏకీభవిస్తారని ఆశిస్తాను *

శ్రీవాణి

## ఆ ముత్యాలు

గొప్ప ప్రభుత్వం అంటే ఏది? ప్రజలు మంచి పనులు చేయడానికి సులభంగాను, చెడు పనులు చేయడానికి క్లిష్టంగాను ఉండాలి.

– గ్లాడ్‌స్టన్

భగవంతుడు కష్టపడేవాడికే ఆశీస్సులు యిస్తాడు. మనం ప్రార్థన చేసినంత మాత్రంచేత ఆశీస్సులివ్వడు.

– కాళిదాస కవి

శృతి చెప్పినట్లు నడిచేవాడు మానవుడు, మతి చెప్పినట్లు నడిచేవాడు దానవుడు.

– శ్రీ సుందర చైతన్యానంద

# పుస్తకసమీక్ష

## శ్రీ వెలుగొండ వేంకటేశ్వర శతకము

రచయిత : శ్రీ మేడేపల్లి వెంకట లక్ష్మీ నారాయణ (చేతన)గారు
ప్రాప్తిస్థానములు : శ్రీవాణి పబ్లికేషన్స్,
C/o యమ్. రామనాథశర్మ, ఇంటి నెం. 3-6-69
పంపింగ్‌బావి రోడ్, ఖమ్మం (స్థంభాద్రి)
లేదా శ్రీ యమ్. వి. లక్ష్మీనారాయణ, ఎం.ఏ. బి.ఇడి,
ఆంధ్రోపన్యాసకులు : శీలం సిద్ధారెడ్డి జ్యోతి కళాశాల
ఖమ్మం వెల : రు. 5-00

భారతదేశములోని ప్రతి నది, ప్రతి కొండ, ప్రతి చెట్టు ప్రతి పుట్ట భగవదంశచేత ప్రతిష్ఠితమై మానవ కోటిని సముద్ధరించుచున్నవి. ఖమ్మం పట్టణమునకు దక్షిణముగా సుమారు 20 కి॥ మీ॥ దూరమున ఖమ్మం నుండి వల్లభిదారిలో అమ్మపేటకు 1 కి॥ మీ॥ దూరమున ఒక కొండ కొండయంతయు తెల్లనై యుండి "తెల్ల కొండ" అని ప్రసిద్ధి పొందినది. అది తెల్ల కొండయై కాలాంతరమున వెలగొండయయినది. ఈ కొండపై శ్రీ వేంకటేశ్వరుని నామము అనాది కాలము నుండి వెలసి యుండుట భక్తజనుల విశ్వాసమును స్థిరపర్చినది. తత్ప్రాంతీయులకు శ్రీ స్వామివారు ఆరాధ్యదైవము. తత్ప్రాంత ప్రజలు స్వామివారి నామమును తమ పిల్లలకు పెట్టుకొందురు. ఈ పెట్టుకొనుట సర్వత్ర కలదు. సింహాచలస్వామి తత్ప్రాంతమువారికి ప్రత్యక్ష దైవము. స్వామివారి మహిమలను పల్లీయులు హృదయ నైర్మల్యముతో పాటలుగా గానము చేయుదురు వారి బ్రతుకులు పంటలు పండును.

పూర్వము కవులనేకులు తమ ఇష్టదైవము పేర శతకములు వ్రాసిరి. ఇష్టదేవతానుగ్రహసిద్ధితో కవిత్వారంభము చేయుటకు శతక రచనము తొలి యత్నము. పోతన యిట్టివాఁడు ధూర్జటి యిట్టివాఁడు ఆధునికులలో శ్రీ వడ్డాది, శ్రీ తిరుపతి వెంకట కవులు, శ్రీ విశ్వనాథ, శ్రీ మాధవపెద్ది ప్రభృతులిట్టివారు. శ్రీ లక్ష్మీనారాయణ గారు మరల అట్టి భక్తుఁడైన కవి.

"సంకట వినాశ వెలుగొండ వేంకటేశ" అను మకుటముతో శతక రచనము చేసిరి. ఇది వీరి రచనా వ్యాసంగమున తొలి యత్నము. వీరి కవిత్వము - పూవు పూచినది, కాయ కాచినది. పండగుటకు కాల మింకను ముందున్నది. ఇది శతకమగుటచేత, భక్తి ప్రధానమగుటచేత, ఈ కవికి ఇందు కవితాశిల్పము ప్రదర్శించు నవకాశము లభింపలేదు. కాని యీ కృతి పఠించువారికి శ్రీ వేంకటేశ్వరుఁడు అక్షరాకృతిలో సాక్షాత్కరించుచున్నాడు. "అలుకనైన చెలిమినైన కామంబుననైన, పద్య గద్య గీతభావార్థములనైన కమల నయనుని దలఁపం గలుషహరము" ఈ పద్యము పోతన్నగారిని తలఁపించు ఒక సౌకుమార్యము ఒక మార్దవము గల్గియున్నది. వెలుగొండ వేంకటేశ్వర శతకము కవిగారి జీవలక్షణమయిన ఆధ్యాత్మిక చింతనను స్థాపించుచున్నది. "నాదు జన్మంబు తరియింప నళిన నయన భవ్యమగు నీదు పేరిట భక్తితోడ శతకమును వ్రాయఁబూనితి" అని యీ కవి యనుట జన్మరాహిత్యమును గోరి కవిత్వము చెప్పిన తిక్కన్న పోతన్నలను వీరు అనుసరించుటే.

కవులు చమత్కారమునకై పరమేశ్వరుని నిందించునట్లు వ్రాయుదురు. కాని అవి స్తుతియందే పర్యవసానము పొందును ఈ కవిగారనేక స్థలములలో ఇట్లు వ్రాసిరి.

"శ్రీనాథుఁడవయ్యు మాఁడడుగులడుగుకొంటివేల?
భవ సముద్రము దాటించు ప్రభుఁడవయ్యు
నదిని దాటుట కొఱకునై నావ నడుప,
గుహుని గోరితివదియేమి కొంచెతనము"

వ్యాజస్తుతి, వ్యాజనిందాలంకారములకు కాసుల పురుషోత్తముడు పెట్టినది పేరు. శ్రీ వేంకటేశ్వర శతకము - ఆంధ్రనాయక శతక గతమైన ఒకానొక లక్షణముచేత రమణీయము. శ్రీ మేడేపల్లి లక్ష్మీనారాయణగారికి దైవానుగ్రహమున లభించిన కవిత్వము సత్కావ్య నిర్మాణదక్షతను ప్రసాదించుగాక.

# కనకధారా స్తవము

మూలము: జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులు, తెలుఁగు సేత: శ్రీ వెలుదండ సత్యనారాయణగారు. తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో ప్రచురింప బడినది. వెల 2 రూపాయలు. ప్రతులకు: శ్రీ వెలుదండ సత్యనారాయణ, ప్రధానాంధ్రోపన్యాసకులు. డిగ్రీ కళాశాల. కొండనాగుల 509401. లేదా వెలుదండ రామకృష్ణ ప్రసాదరావు, మంగనూరు, బిజ్నాపల్లి మహబూబ్ నగర్ 509203.

కనకధారా స్తవమునకు ఆంధ్రానువాదములు పూర్వము చాల వచ్చినవి, ఇప్పుడు క్రొత్తగా ఇది యొకటి. ఈ అనువాదమును గూర్చి శ్రీశ్రీశ్రీ జగద్గురు శృంగేరీ శంకరులు ఆశీస్సులు పలికిరి. భగవత్ స్వరూపులైన శ్రీ శృంగేరీ శంకరులు బిడ్డలయొక్క గుణదోషములు విచారింతురా ! ఆశీస్సులచే మనము తరింతుము

ఆదిశంకరులవారి భక్తి కవితలలో కనధారా స్తవము సుప్రసిద్ధము. వేదవ్యాసుడు, ఆదిశంకరులు ఈ లోకమును ఉద్ధరించిరి. వేదాంతము చెప్పిరి. కవిత్వము చెప్పిరి. సాధారణముగా భగవద్గీత, శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, కనకధారా స్తవము, లక్ష్మీనృసింహ స్తోత్రము వంటి గ్రంథములు, సంస్కృతభాషలో చదువుకొన్నప్పటి ఆనందము తెలుగుసేతయందు లభింపదు. సంస్కృతభాషావైశిష్ట్య మట్టిది. కాని వీనికి ఆంధ్రీకరణములు వచ్చుచునేయుండును. వీనివలన ఒక చిక్కు కల్గుచున్నది. మూలమునకు, తెలుగుసేతకు పోల్చుట యొకటి. పలువురు చేసిన ఆంధ్రీకరణముల తారతమ్య పరీక్ష చేయుట యొకటి.

ఇట్లుండగా శ్రీ వెలుదండ సత్యనారాయణగారు కనకధారా స్తవమును ఆంధ్రీకరించిరి. వీరు ఒక కళాశాలలో తెలుగుభాషా ప్రధానోపన్యాసకులు. పది మందికి చెప్పగలవారు. డా॥ యస్. వి. రామారావు (రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము) గారు సత్యనారాయణగారి ఆంధ్రీకరణమును గూర్చి చెప్పుచు - మూలభావము చెడకుండ స్వతంత్రముగా కొనసాగినదన్నారు. శ్రీ రామారావుగారు "శిష్యవాత్సల్యంబు చెలువుదీర్చిన మూర్తి" యనుట యదార్థము.

ఈ అనువాదమును చదువుచుండఁగా నాకు కొన్ని సందేహములు కల్గినవి (1) "స్యాద్వాదము" అను ఒక శీర్షికయందు, ఈ కవి పద్యరచనను గూర్చి శ్రీ వేంకటరామయ్య పిహెచ్.డి గారు ఇట్లు వ్రాసిరి "నమోఽస్తు హేమాంబుజ .... పుట 8, శ్లో॥ 15 వందనమమ్మ....ఇత్యాది తెలుఁగు అనువాద పద్యమున చతుష్ప్రాసయున్నది అని. ఒకేపదము నాలుగుపాదముల మొదటనున్నంత మాత్రమున చతుష్ప్రాస కాదుకదా !

(2) 2 వ పద్యము ఉత్పలమాలలో "వంగిన మొగ్గ సొమ్ములతమాలము చేరిన భృంగి భంగి ...." ఈ పద్యములో యతి యెక్కడనున్నది ?

(3) మంగళ సంఘమంతయును స్వాంగముగా నొదుగంగ....మకార స్వాకారములకుయతిమైత్రి చెల్లునా?

(4) భంగుల క్షీర వారిధి కుమారిక మార, విహారదృక్- భకార మకారముల యతి స్నేహము ఏ లాక్షణికుడు చెప్పెను ?

(5) 13 వ పద్యము - పుష్పలతా : వందనముల్ రతిప్రియసుతా....ఇత్యాది పద్యమున రతిశబ్దమున్నది. రతిశబ్దమునకు దీర్ఘాంతతి యుండుటకు వీలులేదు ఈ కవికి వమలకు యతిని గూర్చుట యిష్టమేగాని యిది లాక్షణిక సమ్మతము కాదు. వందనమమ్మ దుర్గుణ విమర్దన ! సత్యలపజ్ఞనార్దనీ ! ( 15 వ పద్యము )

(6) 21 పద్యమున "సుఖజీవన పావన దేహ దేహినై" అని వ్రాసిరి. పావనదేహయను సమాసమునకు విగ్రహమెట్లు చెప్పవలయును

"ఉ॥ వంకర బుద్ధితోఁ బనికిమాలిన బేలనటంచు నెంచకే" అని తుది పద్యము ముగించిరి.

ఒక విషయమున్నది. శ్రీ సత్యనారాయణగారి పద్య రచనాశక్తి ధారాశుద్ధి కల్గియున్నదనుట నిస్సందేహముకాని తద్ధారావేగము వ్యాకరణ దోష పర్వతములచే నడ్డుపడి ప్రవాహవేగము కుంటుపడుచున్నది. శాస్త్రపాండిత్య సంపాదనము చేసి సత్కవితా రచన చేయఁగలరన్న విశ్వాసము నాకున్నది.

సమీక్షకులు ; కాజ లక్ష్మీనరసింహారావు

# స్వామి సుందర చైతన్యానంద వేదాంత సందేశం

( ఫిబ్రవరి 23 వ తేదీనుండి మార్చి 3 వ తేదీ వరకు బందరు హిందూ కాలేజి ఆవరణలో ధవళేశ్వరం సుందర చైతన్యాశ్రమాధిపతులు పూజ్యశ్రీ స్వామి సుందర చైతన్యానందుల వారు తమ 87 వ గీతా జ్ఞానయజ్ఞమును నిర్వహించినారు. వారి ఉపన్యాసములలోని కొన్ని విషయములు ఈ వ్యాసము ద్వారా శ్రీవాణి పాఠకులకు అందిస్తున్నాము.

- సంపాదకుడు )

ప్రతి మనిషికి ఆనందం కావాలి. శాశ్వత సుఖం కావాలి. అట్టి ఆనందమును పొందేందుకు నిరంతరము వ్యక్తి ప్రయత్నము చేయుచున్నాడు. ప్రతి వ్యక్తి ఆచరించు కర్మల వెనుక దాగియున్న ఆశయమిదియే.

" కామాయ మానశ్చ కరోతి కర్మాణి "

" మానవు డాచరించు సమస్త కర్మములకు కోరికయే మూలమై యున్నది. " అని ఆదిశంకరాచార్యులవారు తైత్తిరీయోపనిషద్భాష్యంలో తెలుపుతారు.

నిత్యానందము నాశించి మానవుడు కర్మల నాచరిస్తున్నాడు. కర్మలు పరిమితమైనవి. కాలంలో ఆచరింపబడుతున్నవి. పరిమిత కర్మల వలన లభించే ఫలితములు పరిమితములగునేగాని అపరిమితములు కాలేవు. కాలంలో ఆచరింపబడిన కర్మలయొక్క ఫలితములు కాలంలోనే లభించును. కాలంలో ఏవి అందునో అవి కాలంలో అంతరించును. అందుచేత కర్మలు వ్యక్తికి పూర్ణానందమును అందించలేక పోతున్నవి.

ఆనందము నాశించు మానవుడు వ్యక్తులతోను, వస్తువులతోను సంబంధమును కలిగియున్నాడు. ఈ సంబంధములు కూడా వ్యక్తికి దుఃఖమునే పంచిపెట్టు చున్నవి.

వస్తువులు అనిత్యములు. గోచరించునవి ఏవైనను నశింపవలసినదియే. కాల రూప ప్రవాహంలో వస్తువులు కొట్టుకొనిపోయేవియేగాని శాశ్వతంగా నిలిచేవి కావు.

## కొమరగిరి కృష్ణమోహనరావు

The One remains, the many change and pass, Heaven's light for ever shines, earth's shadows fly. " నిత్యమైన ఒక్కటి సత్యమై యున్నది. అన్యములైనవి మార్పుచెందుతూ నశించు చున్నవి. పరంజ్యోతి సదా వెల్గొందుచునే యున్నది. అవనిలోని అనిత్య చిత్రములన్నియు అదృశ్యమగుచునే యున్నవి " అని ఆంగ్లకవి పి. బి షెల్లీ అభిప్రాయ పడినాడు.

ఈ ప్రపంచములో ఏ వ్యక్తిపై ప్రేమను పెంచుకున్నను ఒకనాడు అతడైనా మనలను వదలాలి, లేదా మనమైనా అతడిని వదలాలి. ఇది అనివార్య జీవన సత్యం. మరి ఈ ప్రపంచములో ఏది సత్యం ? ఏది అసత్యం ?

జగత్తులో సత్యవస్తువనేది కుందేటికొమ్ము లాంటిది. "జాయతే గచ్ఛతి ఇతి జగత్ " ఏదయితే వస్తూ, పోతూ వుంటుందో అదియే జగత్తు ఇట్టి పరిణామ

శీలమైన ప్రపంచము శాశ్వతమయ్యేందుకు వీలులేదు. అశాశ్వతమైన జగత్తునుండి శాశ్వతమైన ఆనందము మనిషికి లభ్యమయ్యే అవకాశమూ లేదు.

ఆనందం కొరకు అన్వేషణ నారంభించిన మానవుడు ఈ విధంగా అసంతృప్తికి లోనగుచున్నాడు. సత్య మేదియో తెలియక ఆవేదనతో అలమటించి పోతున్నాడు.

ప్రపంచంలో మార్పుచెందే వ్యక్తులు, వస్తువులు శాశ్వతము కాదు. అందువలన వాటినుండి శాశ్వతమైన ఆనందము లభ్యము కాదు. పోనీ అట్టి ప్రపంచముతో సంబంధము కలిగియున్న తన దేహము శాశ్వతమా? అని ఆలోచించినచో అదియును శాశ్వతము కాదు అని అనుభవము ద్వారా తెలియుచున్నది.

"జలధర పటల భిన్న కుంభోదకవత్ ప్రతిక్షణం వినాశీ శరీరం" "వర్షించను ప్రారంభించిన మేఘము నుండి ప్రతిక్షణం నీరు కారిపోవునట్లు, చిల్లి కుండలో పోసిన నీరు ప్రతిక్షణము కారిపోవునట్లు, ఆయుషు అనుక్షణము కారిపోవుచున్నది."

దేహము నిత్యమూ మారుచున్నది. క్షీణించుచున్నది. నశించుచున్నది. చివరకు శ్మశానంలో పిడికెడు బూడిదగా మారుచున్నది. ఏది సత్యము? ఏది అసత్యము? ఇదొక ఆరని మంట. తీరని ఆకలి. ఇదొక తపన. విశ్రాంతి లేని ఈ పోరాటము ఎంత కాలము సాగించాలి? విరామ మెరుగని ఈ ఆరటము నెంతకాలము భరించాలి?

మారే సమస్తమునకు ఏదియో ఆధారమై యుండాలి. అదేమిటి? ఏమో? అది ఎవ్వరికి తెలిసివచ్చుటలేదు. ఎంతో అభివృద్ధిని సాధించ గలిగిన విజ్ఞాన శాస్త్రము ఈ విషయములో వెనుకబడియే యున్నది.

Something unknown is doing. We do not know what. That is what our theory amounts to: "తెలియరాని దేదో కదులుతునే యున్నది. అది ఏమిటో మాకు తెలియదు. మా శాస్త్రము పొందిన అనుభవ మిదియే" నని భౌతిక విజ్ఞాన శాస్త్ర వేత్త సర్ ఆర్థర్ ఎడింగ్‌టన్ అభిప్రాయపడినాడు.

కనుక తెలిసియో, తెలియకనో అందరి ప్రయాణము ఒకే దిక్కుకు సాగుచున్నది ఆనంద ధామములో కాలిడేందుకే సర్వులూ ప్రయత్నించుచున్నారు.

"సర్వేషాం హి బ్రహ్మవిద్యా పురుషార్థాయ ఉపదిశ్యతే" "సర్వులు పొందదగిన పరమ పురుషార్థము బ్రహ్మ విద్య యే యగున"ని శ్రీశంకర భగవత్పాదులు బృహదారణ్యకోపనిష ద్భాష్యంలో తెలియజేసినారు.

బ్రహ్మమే పూర్ణానంద స్వరూపము. దానిని పొందినపుడే జీవికి శాంతి లభించును. బ్రహ్మమే ఆత్మయని పిలువబడుచున్నది. ఆత్మ సర్వగతము అనంతము. అనంతమైన ఆత్మలో అఖండానందము లభించును. ఆత్మజ్ఞానము నందించునదియే అధ్యాత్మ విద్య. ఇది విద్యలకు విద్యయై శోభించుచున్నది. దీనిని తెలిసిన వానికి సర్వము తెలియుచున్నది.

"యజ్జ్ఞాత్వా సర్వమిదం విజ్ఞాతం భవతి" దేనిని గ్రహించుట చేత సర్వమూ అనుగ్రహింపబడు చున్నదో అదియే ఆత్మ విద్యయని ఉపనిషత్తు అమోఘ ముగా ప్రవచించినది.

ఈ అమరజ్యోతి దర్శనానికే అందరి హృదయాలు ఈ నాడు పరితపిస్తున్నాయి. ఈ దివ్యధామం వైపునకు అన్ని పాదాలు నడక సాగిస్తున్నాయి.

The old Atheism is gone. Religion belongs to the realm of spirit and Mind, and connot be shaken. "పాతబడిన నాస్తికత్వము కనుమరుగైనది. మతము శక్తికి, మనస్సునకు సంబంధించినది యగుటచేత చెక్కు చెదరక ఉంటుంది" అని ప్రముఖ విజ్ఞాన శాస్త్రవేత్త ఎడింగ్‌టన్ అభిప్రాయపడి నాడు.

మనో వాక్కులకు అందని ఈ అమరదీపముయొక్క అద్వైత వెలుగును హృదయంలో నిలిపేందుకు ప్రపంచ గ్రంథములలో మేటియై నిలిచియున్న అద్భుతమైన గ్రంథము శ్రీ మద్భగవద్గీత.

గీత సత్యదర్శిని, సత్యస్వరూపిణి. మానవుని సమస్యలను ముంజేతి కంకణము వలె దర్శించగలదు. పరిష్కారములను వడ్డించిన విస్తరవలె ముందుంచ గలదు గీతా సందేశము అమృతభాండము. బలహీను లకు గీత బలము నిచ్చును బుద్ధిహీనులకు బుద్ధినిచ్చును. కన్నీటి జీవితాలలో పన్నీటిని చిందించును. అర్హులగు వారికి అమృతమునే ప్రసాదించును.

అన్ని కాలాలకు, అందరి వ్యక్తులకు అన్ని దేశాలకు గీతాసందేశము ఉపకరించును. గీత మతగ్రంథము కాదు. మానవాభ్యున్నతిని ఆశించు మహోత్కృష్టమైన గ్రంథము.

నదులు సాగరమును జేరి శాంతించినట్లు, జీవులు పరమాత్మను జేరి తరింతురు సాధకుడైనట్టి జీవుడు సాధ్య రూపుడైన పరమాత్మను జేరుటకు ఉపకరించు ప్రక్రియయే సాధన. సాధనలు అనేకములున్నవి అవియే కర్మ యోగము, జ్ఞాన యోగము, రాజయోగము, హఠయోగము భక్తి యోగము అనెడి పేర్లతో పిలువబడుచున్నవి.

"అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ" అన్ని యోగముల కంటెను భక్తియోగము సులభమైనది. నిరపాయమైనది, సునిశ్చితమైనదన్నారు. భగవద్గీతలోని పండ్రెండవ అధ్యాయము భక్తియోగము. గీతలో ఈ అధ్యాయమునకు ఒక ప్రత్యేకత కలదు - అంటూ శ్రీ స్వామి సుందర చైతన్యానందులవారు భక్తినిగురించి వివరిస్తూ భక్తి వ్యక్తిని పెంచుతూ సమాజంలో శాంతిని నెలకొల్పుతుందని చెప్పారు. భక్తిలేని జ్ఞానం వ్యక్తిలో అహంకారమును నింపుతుంది. జ్ఞానంలేని భక్తి వ్యక్తిలో మూఢాచారమునే మిగిలిస్తుందని స్వామీజీ చెబుతూ

# చైతన్య సూక్తులు

బాధలు మధ్యనే బోధలు అందుతాయి. బుద్ధి చెడితే బ్రతుకు చెడుతుంది.

* భక్తి యాచన కాదు, అర్చన. భక్తుడు భిక్షకుడు కాదు, ప్రేమికుడు.
* మాయను తొలగిస్తే మాధవుడు లభ్యమవుతాడు.
* అజ్ఞానమే వ్యాధి, గురువే వైద్యుడు, ఆత్మవిచారమే ఔషధం, సాక్షాత్కారమే ఆరోగ్యము.
* నిరాశలేని నిరీక్షణ శబరి లక్ష్యం.
* ఆశించేవారికి దొరకదు, అర్హత వున్న వారికే లభ్యమవుతుంది.
* మనతో వచ్చేది ధనంకాదు, ధర్మం.
* ఇది భోగ సంస్కృతి కాదు, యోగ సంస్కృతి, త్యాగ సంస్కృతి.
* ప్రసాద మనస్తత్వంతో జీవించేవారికి ప్రమాదం లేదు, అంతా ప్రమోదమే.
* ఏదైతే కాలంలో ఆవిర్భవిస్తుందో, అది కాల గర్భంలో కలిసిపోతుంది.
* అజ్ఞానమున్నంత వరకు శాంతి ఉండదు.
* వైరాగ్యమే భాగ్యము, జ్ఞానమే సుఖము.

# స్నేహ లత

స్నేహాన్ని పెంచు
ద్వేషాన్ని చించు
స్నేహపు వెలుగులలో
చిరునవ్వులు చిందించు
ద్వేషపు చీకట్లలో కన్నీరు కరిగించు.
అసూయతో, అశాంతితో అణగారిపోకు
ద్వేషంతో, క్రోధంతో కుమిలిపోకు
అపోహాలతో, అపార్థాలతో
అంధుడవైపోకు
అజ్ఞానంతో, అంధకారంతో
చిందులు త్రొక్కబోకు.
విజ్ఞానపు వెన్నెలలో విహరించు
ప్రశాంతపు పాన్పుపై పవళించు
అందరికీ ఆత్మబంధువై పయనించు
ప్రేమానురాగాల భోగంతో జీవించు
స్నేహపు జ్యోతిని చేతపట్టి
అహంకారపు అడవిని కాల్చేయ్
ఆత్మనిరాశ శత్రువుని అంతమొందించు
ఆత్మానందపు మిత్రుని అండ చేర్చుకో.
స్నేహలతను పెంచు
మమతా మల్లెలు పూయించు
మాటా-మాటా కలుపుతూ
చేయీ చేయి కలుపుతూ
ముందుకు పో-యింకా ముందుకు పో.

— లోలభట్టు చిన్నంరాజు

జ్ఞానం వేరు, భక్తి వేరు అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఇది వాస్తవం కాదంటూ, ఈ రెండూ పరస్పరాధారభూతమైనవన్నారు. హృదయము భక్తిగత మైనది. మనసు జ్ఞాన సంబంధమైనది. మనసు హృదయం సమంగా పెరిగినప్పుడే మానవుడు పరిపూర్ణ మానవుడవుతాడని, అదేవిధంగా భక్తి జ్ఞానాదులు వ్యక్తిలో సమంగా పెరిగినప్పుడే మానవుని వ్యక్తిత్వం యినుమడిస్తుందని స్వామీజీ పేర్కొన్నారు. ఎందు వలనంటే ఈ రెండూ పరస్పరాధారభూతమైనవి కావటం వల్లనే నన్నారు.

కర్మ, జ్ఞాన, భక్తి, రాజయోగాలకన్నా గోపికల పరాభక్తి అత్యంత ఉత్కృష్టమైనది, పరమ పవిత్ర మైనదని చెబుతూ అట్టి భక్తిని ప్రతి ఒక్కరూ అలవరచుకొని, ఆచరించి ఉన్న స్థితి నుండి ఉన్నతస్థితికి ఎదగాలన్నారు. పరాభక్తి గుణరహితమైనది, కామ రహితమైనది, అవిచ్ఛిన్నమైనది కావటంవలన, అట్టి భక్తులకు దైవకృప లభ్యమవుతుంది, అట్టివారే తరిస్తారు, ముక్తిని పొందుతారని స్వామీజీ స్పష్టం చేశారు.

ఈ అధ్యాయముపై ధారావాహికంగా పదిరోజులు పాటు మచిలీపట్నం హిందూ కాలేజీ ఆవరణములో స్వామీజీ ఉపన్యసించిరి. ప్రతిరోజు ఉదయం గొడుగు పేటలోని శంకరమఠంలో నారద భక్తి సూత్రములపై సశాస్త్రీయ వివరణము నొసంగుచూ ప్రవచనములను సాగించిరి. శాస్త్రీయమై హేతుబద్ధమైన శ్రీ స్వామీజీ ఉపన్యాసములు వేలాది మందిని స్పందింప జేసినవి. అద్భుత వచో వై భ వం తో, అనర్గళ ఉపన్యాస ప్రవాహంతో, సందర్భోచితముగా ఉదాహరణముల విస్తృ విజ్ఞాన శాస్త్ర, మన తత్త్వ శాస్త్రములను సమన్వయ పరచుచూ శ్రీ స్వామీజీ సాగించిన ప్రవచనములు భక్త జనుల హృదయాలలో చెదరని మధురానుభూతిని నింపి వేసినవి.

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84

SREE VANI

Regd. with Registrar of News Papers
No. RN 000121/20/AL/84NTIII

శు భా కాం క్ష ల




Edited, Printed and Published by Komaragiri Krishna Mohan Rao
at Spandana Printers, Machilipatnam